# ATMAJYOTHI

[ Leo Tolstoy's 'Two Pilgrims' Adapted ]

BY

MUDDA VISWANADHAM

[ Kavitha Samithi ]

APPROVED FOR CLASS USE

*(Vide Ft. S. G. G. Dated 14th May '46, Pages 6 & 20)*

JAYA NIKETHAN

PUBLISHERS :: MADRAS



[నవోదయ సాహితీక్షేత్రమ్]

# ఆత్మజ్యోతి

[మానవసేవయే మాధవసేవ]

*

ముద్దా విశ్వనాథము
(కవితా సమితి)

జయా ప్రసూనములు : మొదటి మాలిక

౧. ఆత్మజ్యోతి (టాల్‌స్టాయి కథ)
౨. జన్మభూమి - ఇతర నాటికలు
౩. ప్రేమాంజలి (టాల్‌స్టాయ్ కథ)
౪. సంధ్య : శుభోదయము
(టాల్‌స్టాయి కథలు)
౫. తూలిక (చిత్రకథా సంపుటి)
౬. ఛాయ - (నాలుగు నాటికలు)
౭. దివ్యవాణి - ఇతర కథలు
౮. రామనామం - ఇతర రచనలు
౯. The Wonderful Name
(అనుబంధ గ్రంథము)

జయా నికేతనము :: మదరాసు

*

## 'ఆత్మజ్యోతి'ని గురించి ప్రముఖులు—పత్రికలు:

1. "పాఠ్యగ్రంథనిర్ణయ సంఘము వారీ గ్రంథమును పాఠశాలలలో ప్రవేశపెట్ట దగినదిగా నిర్ణయించి ఆంధ్రదేశమునకు గొప్ప సేవచేసిరి.'—భారతి.

... ... ... ...

2. "Furnishes attractive reading"—*Hindu.*

... ... ... ...

3. "నేను చదివి ముదమొందితిని. అది లెస్సగాం గూర్పంబడినది."—శ్రీ శ్రీ శ్రీ రాజా విక్రమదేవవర్మ.

... ... ... ...

4. "ఆనందముతో నందుకొని అప్పుడే చివరదాక ఆపక చదివితిని. నాయానందమున కిక మేరలేదు. ఆ మృదుపదములు, ఆ మధుర శైలి, ఆ సామెతల పొందిక అన్నియు సహజములై యొప్పుచున్నవి. తమ పాత్రము చదివినవారికి మాత్రమే మూల గ్రంథకర్త గొప్పతనము బోధపడును. ఇది మనస్ఫూర్తిగా వ్రాసినదిగాని ముఖప్రీతికై వ్రాసినది కాదు."—శ్రీ మంగిపూడి వేంకటశర్మ.

... ... ... ...

5. "టాల్‌స్టాయి మహామహుడే! ఆంధ్ర బాలబాలికలకు తేట తెనుగున నీకథ చెప్పుచున్నాడా" అన్నట్లు ఇది చక్కగా వ్రాయబడినది."—ఆంధ్రభూమి.

# భూమిక:

కాశి కాశి యనుచు కడువేడ్కతోఁబోదు
రందు గల్గుదేవుఁ డిందు లేఁడె
ఇందు నందు గలఁడు హృదయంబు లెస్సైన
విశ్వదాభిరామ వినుర వేమ.

—వేమన.

జీవి ఆశయము నిత్యానందము. అట్టి గమ్యస్థానమును చేరపఁగల రాజమార్గము ఆత్మబలము. దీనికి సాధనము ఏకాగ్రత. ఏకాగ్రతకు మూలబీజము చిత్తశుద్ధి. తపములు, క్రతువులు, పూజాపురస్కారములు— ఈ యన్నియును చిత్తశుద్ధికొఱకే. వేదములు వాకొనునది, వేమన వివరించునది దీనింగూర్చియే.

స్థూలదృష్టికి ఇది సూక్ష్మాంశమే అయినను ఆచరణమున మాత్రము కష్టసాధ్యము. వేలకొలఁది వత్సరములు వనివాళ్లు జెందిన విశ్వామిత్రుని వంటివాఁడే విఫలుఁడైనాఁడు. అట్టిచో నల్పజ్ఞుల మాట ఆలోచింపనేటికి?—మనస్సు నావరించియుండు కలుపును నిర్మూలించి చిత్తమును శుద్ధిగావించుకొనుటయే మానవుని కర్తవ్యమై యున్నది. కంటకావృతమును దుర్గమమును అగు నిటువంటి క్షేత్రము పవిత్రమగునంతవఱకు జీవుఁడు జన్మపరంపరలో మునిఁగి తేలుచునేయుండునని హిందూమతబోధ. జీవితములోని ఈ ఘట్టము నెదుర్కొనుటకె భక్తిజ్ఞాన కర్మయోగాది సాధనము లేర్పడియున్నవి.

'ఆత్మజ్యోతి' కథలో కలవరపరచు వ్యూహమెద్దియు లేదు. కాని ప్రతిజీవియు జిజ్ఞాస చెందక తప్పని గొప్ప క్లిష్టసమస్యను పాఠకుని ముందు పెట్టుచున్నది. సంసారసౌఖ్యమును సంపూర్తిగ ఆనందించుచు, కుమ్మరిపుర్వు ఫాటముగ మెలఁగ నేర్చిన వివేకి సువర్ణనము. గృహస్థాశ్రమము రోసి మోక్షాకాంక్షితుఁడై, అన్యమార్గము లవలంబించియు నైహిక బంధము ఛేదించుకొన చేతగాక చెడిన రేవడి దీక్షితులు. ఇట్లు భిన్నము లగు చిత్త ప్రవృత్తులు గల ఇరువురు ప్రధానవ్యక్తులను కథారంగమున ప్రవేశపెట్టి, చదువరి చిత్తమున ఈ మహాద్విషయము నచ్చునట్లు టాల్స్టాయ్ మహాశయుఁడు సువ్యక్త పరచుచున్నాఁడు.

1885 లో టాల్స్టాయ్ మహర్షి రచియించిన 'ఇరువురు యాత్రికులు' (The Two Pilgrims) అను కథకు ఇది స్వేచ్ఛానుకరణము. ప్రకరణాద్యంతమునందలి పద్యరత్నములు—శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల 'కావ్యకుసుమావళి' లోనివి.

—ము. వి.





జననము : 9 సెప్టెంబరు 1828

*Leon Tolstoy*

నిర్యాణము 20 నవంబరు 1910

## కౌంట్ లియో టాల్స్టాయ్ :

మానవహృదయ మెఱింగిన మహాజ్ఞాని. తత్వ మెఱింగిన గొప్ప పండితుఁడు. కళారహస్య మెఱింగిన కవిపుంగవుఁడు.

అతని భావములు హృదయమును చూరఁగొనును. రచనలు మనస్సున కుత్సాహము నిచ్చును. కల్పనలు మిక్కిలి సహజ సుందరములుగ నుండును. జీవితములోని ప్రతి చిన్ని ఘటనకు కళారూప మీయఁగల ఉత్తమ రచయిత టాల్స్టాయ్. అతని రచనా వైదగ్ధ్యము ప్రపంచ హృదయముల నాకర్షించినది.

తన కున్న ధన మంతయు దరిద్రులకు సాయము చేయుటలోను, జీవిత మంతయు ప్రపంచమునకు మంచి మార్గముఁ జూపుటలోను వినియోగపఱిచిన త్యాగమూర్తి. భార్యయు బంధువులును అడ్డుపెట్టినను బెదరించినను లక్ష్యము సేయక తన యావ దాస్తియు ప్రజోపయోగము కొఱకే ధారవోసి—జీవితాంతము దనుక పల్లెప్రజలతో సరిసమముగ కాయ కష్టపడిన ఆదర్శజీవి.

టాల్స్టాయ్ తన రచనలపై స్వత్వము తానుంచుకొనలేదు, ఒకరికి విక్రయింపలేదు. భార్య పట్టుదలగాని గ్రంథవిక్రేతలు చూపెడి ధనాశకాని అతని అభిప్రాయములను కదిలించలేకపోయినవి.

ప్రపంచాకాశమున టాల్స్టాయ్ ఒక దివ్యతార! సాహిత్య సీమలో దారిఁ జూపెడి జ్యోతిర్మూర్తి!! మానవలోకమునకు మార్గదర్శకుఁడు!!!

ఆంగ్లభాషలో అతని గ్రంథములకు గలిగిన వ్యాప్తి మఱి యే గ్రంథాలకును లేదు.

'రామమోహన్.'

# ఆత్మజ్యోతి

౧

"కాలవశంబున గతమును మఱచి
యజ్ఞానవశమున నఖిలంబు మఱచి
పెద్దల గతి వీడి పెడత్రోవఁ బట్టి
మలిన వృత్తుల మైన మాట నిజంబె;
పాటింప మైతిమి పరమార్థ గతుల
నాచరింపఁగ నేర మార్య ధర్మముల;
వెలయ ప్రాయశ్చిత్త విధి యొసంగించి
మమ్ముద్ధరింపు మమ్మా! వేగఁ జొక్క—!"

---

దీక్షితులు ఎలమంచిలి లోని శ్రోత్రియ

సంకల్పము: బ్రాహ్మణ కుటుంబమున జన్మించినను

వృత్తి ధర్మముచే గొప్ప వ్యాపారస్థుఁడు.

ఇతని మిత్రుఁడు—సుదర్శనము—ఒక మోస్తరు సంసారి. కాలము గడపిన ఈ మిత్రు లిరువురును ఒకప్పుడు తీర్థయాత్రకుఁ బోవుదమని సంకల్పించుకొనిరి.

దీక్షితులు శాంతియుతుఁడు, చాల గౌరవనీయుఁడు, నీతి కోవిదుఁడు, కచ్చితమయిన పెద్ద మనుష్యుఁడు. అతనికి దురభ్యాసము లెవ్వియు లేవు. జన్మములో నెప్పుడును ఎవ్వరిని పల్లెత్తు మాటాడి యెఱుఁగడు. ఈతఁడు రెండుసార్లు స్వగ్రామమున పంచాయతి కోర్టునకు అధ్యక్షుఁడుగ ఎన్నుకొనఁబడి తన పదవి స్తుత్యర్హముగ నిర్వర్తించినాఁడు. ఇతనిది పెద్ద కుటుంబము : ఇరువురు పుత్రులు, వివాహితుఁడగు నొక మనుమఁడును గలరు. ఎల్లరును సమష్టిగనే ఉండిరి. దీక్షితులు డెబ్బది యేండ్ల ముదుసలియైనను మంచి స్ఫురద్రూపి, దృఢకాయుఁడు; అతని పొడువైన గడ్డము ఇపు డిపుడే నరయ నారంభించినది.

సుదర్శనము కూడ వయోవృద్ధే. జన్మమున బ్రాహ్మణేతరుఁడు కాని అతని సుగుణపుంజము దినదినము వికాసవంతమై తోడి వారెల్లరును "ఈతఁడు మన జాతిలో తప్పఁబుట్టినవాఁడురా!" యన, సత్కీర్తి వడయుచు సంసార పక్షముగ జీవయాత్ర నడపుచుండెను. పూర్వ మితఁడు వడ్రంగి పనిలో నుండెడు వాఁడు. వార్ధకము సన్నిహితమైన కారణమున ఆ పని చాలించుకొని ఇప్పుడు తన చిన్న సేద్యమునకు తోడు, పాలు పెరుఁగు వెన్న మొదలగునవి విక్రయించు వ్యాపారము కూడ పెట్టుకొనెను. ఈతని కుమారులలో నొకఁడు సదా తండ్రియండ నుండును;

రెండవవాఁడు పైకి బోయి పనులు చక్కబెట్టును. సుదర్శనుడు మంచి సరదా పురుషుఁడు, దయాళువు; కలిగిన దానిలో కాసంత రాలుపఁగల వితరణశీలుఁడు. పొడుము పట్టెక్కించి చక్కని పాటలు పాడును. నిత్య సంతోషి నిర్వ్యాపారుఁడు; ఖులాసా పురుషుఁడే కాని ఒకరి జోలికి పో నొల్లఁడు. కుటుంబమువారితోను ఇరుగు పొరుగు వారితోను తలలో నాలుకగా వర్తించుచు ఒడు దొడుకులు లేకుండ నెమ్మదిగ కాలము వెళ్ళఁ బుచ్చుకొనును. పొగ డ్తల కిచ్చగింపని మనః ప్రవృత్తి ఇతనిది. ఆకారమున పొట్టి వాఁడు; నల్లని కురులు, ఉంగరములు చుట్టుకొనిన గడ్డము, చిన్నిబొజ్జ, బట్టతలయు గలిగి యుండెను.

యాత్ర చేసికొని వత్తమని మిత్రులు చిరకాలము క్రిందట పరస్పరము బాసచేసికొని యుండిరి. కాని దీక్షితులకు తీఱిక లేక ఎప్పుడును ఏదో ఒక పని అతనిని ఊపిరి సలుపనీయకుండెను. ఒక పని ముగిసినది తడవుగ మఱొక పని వెన్నంటి వచ్చుచుండెను. మొదట మనుమని పెండ్లి సందడి; పిమ్మట కుమారుఁడు సేననుండి మరలివచ్చుచ్చుట; ఇపుడు నవ్యకుటీరనిర్మాణ కార్యభారము.

ఒక యుత్సవ దినమున ఉభయులును కలసికొని అచట నున్న దుంగ మీఁద కూరుచుండి ఇట్లుబుసులాడఁగడంగిరి :

సుదర్శనము :—ఏమోయి దీక్షితులూ! మన దీక్ష ఎప్పుడు నెఱవేఱుట? అదిగో యని ఆఱు నెలలు చేయు చుంటివే!

దీక్షితులు:—[ముఖము చిట్లించుకొనుచు]—చూడు! ఇది నాకు మిక్కిలి చిక్కు సమయము. అందుచేత మఱి కొంత కాలము పోవలెను. ఇల్లు కట్టి చూడు పెండ్లి చేసి చూడు మన్నటులు నూట యేఁబది రూపాయలతో సరిపడు ననుకొన్న క్రొత్తపాకకు ఇంతవరకు మున్నూఱు దాఁటినది. ఇంకను పని తెమలనే లేదు. దైవానుగ్రహ మున్నచో వేసంగి వెళ్లిన తరువాత బయలుదేఱుదము.

సుదర్శనము :—అబ్బే! నన్నడిగితివా ఆలస్య మెంత మాత్రము పనికిరాదు సుమా! శీతకాలమే ప్రయాణమున కనుకూలము.

దీక్షితులు :—నిజమే నయ్యా! శీతకాలము అను కూలమే. ఇంటిపని మొదలిడితిని గదా, సగము సగములో ఎట్లు వదలి రమ్మనెదవు?

సుదర్శనము:—ఇంటిలో మఱెవ్వరును లేరా యేమి? నీ కుమారుని కప్పగింపరాదా?

దీక్షితులు :—ఓ! బాగుగనే చూచును. వానిని నమ్ముకొనుట కుక్క తోఁక పట్టుకొని గోదావరి ఈఁది

నటులే. వట్టి పోకిరి జట్టు, ఒక్క నిమిషము కాసంత నేను కనుమలు గయినచో ఇల్లు తీసి పందిరి వేయును.

సుదర్శనము :—చూడు దీక్షితులూ! కాటికి కాళ్లు సాచుకొన్న మనము శాశ్వతమా? మనము హరీయన్న తరువాత ఈ పను లన్నియు వారలు చక్కబెట్టుకొన వలసిన దేనా? ఇప్పటినుండియు నీ కొడుకును పని నేర్చుకొననీ.

దీక్షితులు :—నిజమే, నీవు చెప్పిన దంతయు నిశ్చయమే. అదేమో కాని ప్రతి పనియు స్వయముగ చూచుకొనకున్న మనస్సునకు తృప్తికరముగ నుండదు.

సుదర్శనము :—అనుకొనుటే గాని, ఎన్నని నీవు సొంతముగ చేసికొనఁగలవు? మొన్నను మా యింటిలో ఆఁడువాండ్రు పండుగకు అలుకులని ముగ్గులని ఊరక హడావుడి పడిరి. ఈ పని కాదని ఆ పని, ఆ పని కాదని ఈ పని, ఎంత చేసినను ఇంకను యేదియో కొఱఁతగనే కన్పట్టుచుండెడిది......

దీక్షితులు :—మిత్రమా! ఇంటిమీఁద బోలెఁడు సొమ్ము పోసినాను. అదియుఁ గాక వట్టి చేతులతో బయలు దేఱ లేము కదా? ఒక శతమైన పట్టుకొని పోవలెను. ఈ సొమ్ము తెచ్చుట మాటలతో నగునా?

సుదర్శనము ;—పాపమున కొడి గట్టుకొను దీక్షి తులూ! ఉన్న మాట యనిన ఉలు కెక్కువ గాకుంటే, నా ఆ_స్తికంటె పదింత లున్నను నీకు డబ్బు లేదో యని యేడు పేల? నీవు ఎప్పుడు బయలుదేఱుదువో చెప్పుము, రెండవ ప్రస_క్తి నాకు వలదు; ఇప్పుడు నిజముగా నాయొద్ద సొమ్ము లేదు, అయినను ఎక్కడనైన పుట్టించుకొని వచ్చెదను.

దీక్షితులు :—అబ్బా! ఇంత మోతుబర వను సంగతి తెలియలేదోయి; డబ్బెట్లు పుట్టించుకొని వచ్చెదవో కాసంత చెప్పు.

సుదర్శనము :—ఓసి, పెద్ద బ్రహ్మాండమా యేమి! కొంత సొమ్ము ఎటులో ఇంటినుండి గోకెదను. మిగిలిన దాని మాటయా! ఇదిగో, పొరుగాయన మా వెల్లావు కావలెనని చాలకాలమునుండి అడుగు చున్నాఁడు. విక్ర యించెదను.

దీక్షితులు :—రేపో మాపో ఈను ప్రొద్దులకు వచ్చిన చక్కని గోవును అమ్ముకొను టెంత యవివేకము! అదృ ష్టము వలన అది కోడె దూడను పెట్టి, పొరుగాయన లాభము పొందునపుడు అయ్యగారి కనులనుండి కాలువలు పాఱునే!

సుదర్శనము :—ఓయి వెఱ్ఱివాఁడా! నీ వటు లనుకొనుచున్నావు కాఁబోలును. నా జీవితములో ఏ విషయమును నాకు విచారము కల్గింప దని నమ్ము. ఒక్క నా పాతక హారణోపాయమును గుఱించి మాత్రమే నే పరితపించునది. 'ఆత్మ' కంటె ప్రియతరమగున దేదియు లేదు కద!

దీక్షితులు :—వాస్తవమే. కాని ఇంటి యొద్ద పరిస్థితు లెదురెత్తుగ నున్నవు డేమి చేయఁగలము?

సుదర్శనము :—ఆత్మ విషయకమైన పొరపాటున కేమందువు? అది మఱియు ఘోరము కాదా? మనము శపథము చేసితిమి. వెళ్లి తీఱవలెను. కర్మకు అంతమూ లేదు కాలమునకు నిశ్చయమును లేదు. అందుచే ఇఁక నొక్క క్షణమైన ఆలసింపకుము, లెమ్ము.

దీక్షితులు :—లేడికి లేచినదే ప్రయాణమా?

సుదర్శనము :—చెప్పఁ గలము కాని చేయింప లేము కద! పూర్వజన్మ సుకృత మున్నచో నేఁడు గాకున్న రేపయిన నీకే మతి తిరుగును. నేను పోరుటవలన లాభ మేమున్నది? ఆలోచించుకొనుము, ఇదే నే చెప్పవలసిన ముక్క.



# ఆత్మజ్యోతి

౨

"విశ్వ మంతయు నిండి వెలుగొందు నిన్ను
నావాహనము సేసి యర్చించు టెట్లు ?
అఖిల లోకాధారుఁడై యున్న నిన్ను
అగ్రపీఠం బిచ్చి యర్చించు టెట్లు ?"

---

ప్రయాణము : దీక్షితులకు మనసు తిరిగినది. ప్రయాణమును గుఱించి ఆలోచించినాఁడు. ఉదయముననే సుదర్శనమును దర్శించి—

దీక్షితులు :—మిత్రమా ! ప్రయాణ సన్నద్ధుఁడవు కమ్ము. నీ పలుకులెల్ల సత్యము. మనల పుట్టింపను గిట్టింపను ఆ పరమేశ్వరుఁడే కర్త. ఈ పాటిదైన జవసత్త్వము లున్నపుడే మనము బయలు దేఱవలెను.

వారము పది దినములలో ముసలి యాత్రికులు పయనమునకు సంసిద్ధులైరి.

దీక్షితులకు నగదు ఆస్తి యున్నది. ఇంటి ఖర్చుకై నూఱు భార్య చేతి కిచ్చి రెండు నూర్లు తాను చేతఁబట్టుకొనినాఁడు.

సుదర్శనము కూడ తయారుగనే ఉన్నాఁడు. చూలి యావును పొరుగువానికి విక్రయింపఁగా డెబ్బది రూప్యములు వచ్చినవి. మఱి కొంత సొమ్ము ఇంటిలోనుండి తీసికొని నాఁడు. సతియు కోడలును అప్పటప్పట వారు దాఁచుకొన్న దంతయు సంతోషముతో అతని కిచ్చివేసిరి.

ఇంటి వ్యవహారము లన్నియు దీక్షితులు తనయునకు బోధపఱచి ఒప్పగించెను. అమరకము చేయవలసిన బీడు లెన్నో, ఏయే మడులకు ఎరువు వేయవలసియున్నదో, పాకకప్పు ఎవ్విధమున పూర్తి చేయవలెనో—ఇట్టి విషయము లందు కడు జాగ్రత్తతో నిదానముగ నాలోచించి తగు ఉత్తరువులు జారీ చేసెను.

"పాలు పెరుగులు న్యాయమైన ధరల కమ్ముచుండుఁ" డని మాత్రమే సుదర్శనము భార్యకు హితబోధము చేసెను. "ఇటుపైని గృహయాజమాన్యము మీ యది, ఏ పను లెట్లుచేసిన బాగుగ నుండునో యుక్తాయుక్త వివేచనములతో మెలఁగి సంసారము నిర్వహింపుడు" అని స్వకుటుంబముతో చెప్పినాఁడు. ఇంతకంటె ఇంటిని గుఱించిన వేఱు ప్రసంగము లెవ్వియు అతఁడు చేయలేదు.

చివర కన్నియును సమకూడినవి. వారివారి భక్తి ప్రేమల పురస్కరించుకొని తాతలకు దారిలోనికి మినుప

రొట్టెలు తయారుచేసి ఇచ్చువారు—ఉప్పుపిండి మూట గట్టువారు—"మా నాయనకు అటుకులు బెల్లము ఇష్టము; నిలువ కూడ ఉండు" నని అ వొక పొట్లము కట్టు పుత్రులు —"మా మామ గా రెండ కోర్వలే" రని చెప్పి గొడుగు లందించు కోడండ్రు—"మా తాతకు మంచి నస్యమే కాని పనికి రా"దని పెద్ద బుడ్డిలో దట్టించి తాతగారి రొండిని దోఁపు మనుమలు—ఇట్టి అవ్యాజప్రేమతో కుటుంబము వారు వారిని ఊరు దాఁటువఱకు సాగనంపిరి. కంటి కగు పడు వఱకు వీ రెల్లరును అట్టట్టె చూచుచుండ ఆ యాత్రి కులు తూర్పు ముఖముగ బయలుదేఱి అదృశ్యులైరి.

సుదర్శనమునకు మనసు ఉల్లాసవంతముగ నుండెను. హృదయము తేలికగ నుండెను, అతని చింత లన్నియు ఊరి పొలిమేరనే విడిచిపైచెను. సహవాసి కెట్లు ఆనందము చేకూర్చుట? ఎవ్వరికిని మనసు నొప్పింపకుండ వర్తించు టెటులు? యాత్ర నిర్విఘ్నముగ కొనసాగించుకొని వచ్చి, తోడివారలతో తిరుగ నెప్పుడు కలసి మెలసి యుండుట?— అనునవియే అతని మనస్సులోని తలఁపులు. నడచునపుడు కూడ మంత్రములు జపించుకొనును. జ్ఞప్తిలో నున్న మహా పురుషుల జీవిత రహస్యములు నెమరునకుఁ దెచ్చుకొనుచుం డును. మజిలీలు చేసినపుడెల్ల—ఎవరి కేని కించిత్తైన ఉప కారము సలుపఁగలనా? కనీసము హితబోధమైన గావింపఁ

గలనా? అని అతని హృదయము తపించుచుండును. సుదర్శనమునకు ప్రయాణము సంతోష ప్రదముగనే యుండెను గాని ఒక్క అలవాటు మాత్రము విడువ లేకుండెను. పొడుము పీల్చుట మానివేయుదు మను దృఢ సంకల్పముతో మనుమడు రొండిని బెట్టిన కాయ కూడ ఇంటి యొద్దనే వదలి వేసినాడు.

పిచ్చికోతి వంటిదికదా మనస్సు! సుదర్శన మెంత నిగ్రహ దీక్షతో నున్నను, అప్పు డప్పుడు దారిం బోవు వారలను "ఏ దండీ! ఒక చిన్న పట్టు!" అని అడిగి చేయి చాంపకుండ నుండలేకపోయెను. ఈ నస్యభిక్షుక వృత్తిచేత నడకలో మిత్రునకు వెనుకం బడుచుండెను.

ఇంక దీక్షితుం డెట్లుండునో చూతము: నిలుకడయైన గమనము, మితభాషిత్వము, ఒరుల కెగ్గు సేయక పోవుట—ఇవన్నియు బాగుగనే యుండెను; కాని మనస్సు మాత్రము నిశ్చలముగ లేకుండెను. గృహ సంబంధమగు లంపటత నుండి మనసు విడివడలేదు. 'ఇంటిలోని వారెటులున్నారో, పీ రెటులున్నారో, చేయవలసిన పనులన్నియు కుమారునకు పూర్తిగ చెప్పెనో ఏమయిన మఱచెనో, ఒప్పగించిన పనులెల్ల కొడుకు సరిగ నెఱవేర్చునో లేదో'— ఇదే ఆలోచన. కర్షకులును ఎరువు బండ్లును కంటం బడి

నప్పుడు "మావాఁడు నేఁ జెప్పిన చొప్పున చేసెనో లేదో" అని చింతించుచుండును. "ఈ పట్టున ఇంటికి మరలి పనులెట్లు చేయవలెనో కుఱ్ఱవానికి బోధింతునా? లేక నేనే స్వయముగ చేసికొందునా?" అని అప్పటప్పట మనసులో తలఁపులు చుండును.



# ఆత్మజ్యోతి

## 3

"సకల జీవ సంతతులకుఁ జాలినంత
యన్నమును గూర్చుచున్నది కన్నతల్లి ;
కడుపు గాలెడి తమ్ముల కన్ను మూసి
యారగింప నోరాడునే యన్నలార !"

---

ఐహిక బంధము : ఆ ప్రకారము ఎలమంచిలిలో బయలు దేఱిన మన యాత్రికులు అనకాపల్లి, విశాఖపట్టనముల మీఁదుగా సింహాచల క్షేత్రమునకు మొదట పోయి కొండనెక్కి హనుమంతుని ధార – ఆకాశధర – పుట్టుధార – మొదలయిన ధారలలో స్నానము లాచరించి స్వామిని దర్శించిరి. అక్కడనుండి పద్మనాభ క్షేత్రము, రామ తీర్థములు, అరసవిల్లి, శ్రీ కూర్మము మొదలగు క్షేత్రములు దర్శించి గంజాము మండలములో ప్రవేశించిరి. ఆ నాడిది కళింగ ప్రదేశము.

ఇచ్చట కూడ దీక్షిత సుదర్శనములకు ప్రజ ప్రతి ఫల మపేక్షింపకయే వసతులు కల్పించిరి కాని వెనుకటి

వారివలె ఉచితముగ భోజన సదుపాయము చేయఁజాల రైరి. కొన్నిచోట్ల సొమ్ము వెచ్చించినను తిండి దొర కుట దుర్లభ మాయెను.

"అయ్యో! గత వత్సరము పంటలు సమూలముగ నాశన మైనవి. పెదపెద్ద రైతులందఱును దివాలా తీసిరి. కాసంత పచ్చగ నుండిన వారు పుస్తెలు పూసలు తాకట్టు పెట్టుకొని మిక్కిలి కష్టము లనుభవించుచున్నారు. ఇఁక పేదల మాటయా? పలువురు రూపు మాసిరి; మిగిలియున్న కొలఁది మందియు కంకులు తినియు ఆకు అలములు తినియు జీవములు నిల్పుకొనుచున్నారు"—అను విలాపములే ఎల్లెడ వినఁబడెను.

ఒకనాఁటి యుదయమున మిత్రు లిరువురును మోయఁ జాలినన్ని రక రకముల తినుబండారములు మూట కట్టు కొని మధ్యాహ్నమగుసరికి చాలదూరము సాగిపోవుద మను కొనిరి. సుమారు ఏడుమైళ్లు పోవునప్పటికి ఒక చిన్న ఏఱు తగిలినది. అచ్చట పొట్టలు నింపుకొని విశ్రాంతి దీసికొనిరి. సుదర్శనము క్రొత్తగా సేకరించిన పొడుముకాయ తీసినాఁడు. దీక్షితులు తలపంకించుచు—

"సుదర్శనమా! దిక్కుమాలిన అభ్యాస మింకను మాన వైతివి గద!"

సుదర్శనము:—ఎంత తంటాలు పడినను మాన లేకున్నానోయి ; నీ వెన్ని చెప్పినను ఈ విషయమున లాభ ము లేదు.

తిరుగ లేచి వారు దారిఁబట్టిరి. మఱి యేడుమైళ్లు వెళ్లి ఒక గ్రామము చేరుకొనుసరికి మట్ట మధ్యాహ్నమైనది. తీక్ష్ణమైన ఎండ. సుదర్శనము మిక్కిలి బడలియుండుటచే ఒకింత సేద దీర్చుకొని కొంచెము దాహము పుచ్చుకొని సాగవచ్చునని తలఁచినాఁడు. కాన మెల్లగ దారి త్రొక్కు చుండెను. మిత్రునికోసము నిలఁబడుచుండుట దీక్షితులకు కొంచెము ఇబ్బందిగనే తోఁచినది.

సుదర్శనము:—మిత్రమా ! నాకు గొంతుక ఆఱి పోవుచున్నదోయి.

దీక్షితులు:—నాకు దాహ మగుటలేదు, నీవు వెళ్లి రమ్ము. నేనిచటనే నిలఁబడెదను.

సుదర్శనము:—నీవు నిలచి యుండ నక్కఱలేదు. నడచుచుండుము. అదిగో, ఆ కనఁబడుచున్న యింటికి పోయి దాహము తీర్చుకొని వచ్చి చిటికలో నిన్ను కలసి కొందును.

దీక్షితులు:—సరే !

అనుచు ఒంటరిగనే పోవుచుండెను. సుదర్శనము కుటీరమువైపు మరలెను.

అదొక గుడిసె. ఎఱ్ఱమన్ను ప్రామి నిడుపు సున్నపు పట్టీలు వేసిన మట్టి గోడలు. చాలచోట్ల గోడలు చవుడు చఱచిపోయినవి. కప్పు ఒక ప్రక్కకు ఒఱగినది. చిర కాలమునుండి పాక మరమ్మతు అనుమాట ఎఱుఁగదని చూచుటతోనే చెప్పవచ్చును. దీనికి ద్వారము పెరటివైపున నుండుట గని సుదర్శనము లోపల ప్రవేశించెను. అట నొక తాత నేలపై పరుండి యుండెను. బక్కచిక్కియున్నాఁడు; పేడి గడ్డము; మాసిపోయిన చిరుగుల గుడ్డ ఒకటి పైన. తొలుత నతఁడు నీడనే పండుకొని యుండెనేమో కాని ప్రభాకరుఁ డిప్పుడు తన ప్రభావ మంతయు మూలనున్న ముసలివానిపైఁ జూపుచున్నాఁడు. తాత నిద్రించుచున్నట్లు కనఁబడదు; మెలఁకువతో నున్నను జడుఁడై పడియున్నాఁడు.

"అయ్యా! కొంచెము మంచితీర్థము" అనినాఁడు సుదర్శనము, జవాబు లేదు. "ఇతనికి సుస్తీగ నున్నదో లేక మనస్సు బాగుగ లేదో" అనుకొనుచు సుదర్శనము తలుపు దగ్గఱకు వెళ్లెను, లోపలినుండి శిశురోదనము విన వచ్చినది. గొండ్లెము కదలించి తలుపు తట్టుచు "అయ్యా, ఏమండోయి!" అని కేక వేసినాఁడు, ప్రత్యుత్తరము

రాలేదు. చేతికఱ్ఱతో కొట్టుచు యెలుగెత్తి అఱచినాఁడు. అదియు వట్టి అరణ్యరోదనమైనది. శక్తికొలఁది బొబ్బలు వెట్టినాఁడు, జవాబునకు నోఁచుకొనలేదు! ఇఁక మరలి పోవుద మనుకొన్నంతలో, లోపలినుండి చిన్న మూలుగు వినఁబడినది.

"ఓహో! ఇక్కడేదో విశేషమున్నది, చూడవలె" నని తలఁచి సుదర్శనము తలుపు దరిఁ జేరెను.



# ఆత్మజ్యోతి

## ౪

"పందిరిని జిన్ని తీవలు ప్రాఁకినట్లు
మేఘములలోన మెఱపులు మెఱసినట్లు
ద్యోతలంబున నొక చుక్క తోఁచినట్లు
వింతగా నాశ పొడసూపి విరియఁ బ్రాఁకె!"

---

పాత్ర మెఱిఁగి దానము :

సుదర్శనము గడియ త్రిప్పినాఁడు, తలుపులు విడినవి. లోపలి గది తలుపుకూడ తెఱచినాఁడు. అక్కడి దృశ్యము!—

కుక్కిమంచము మీఁద తల వ్రాల్చుకొని ఒక ముసలిది కంఠగత ప్రాణముతో పడి యున్నది. ఆమె ప్రక్కను–ఊసర పొట్ట, పాలిపోయిన బక్కశరీరము–కలిగిన ఒక చిన్ని కుఱ్ఱఁడు నిలచి యున్నాఁడు.—"కడుపు మండుకొని పోవుచున్నది, తినుటకే మయిన పెట్టు" మని కేకలు పెట్టి ఏడ్చుచున్నాఁడు ; కొంగు పట్టి లాగుచున్నాఁడు.

సుదర్శన మిక్కడకు వచ్చెను. గది దుర్గంధ భూయిష్ఠమై గాలిలేక ఉక్కిరి బిక్కిరి చేయుచుండెను. ప్రొయ్యి

ప్రక్కను చినిగిన గోనెపై ఒక పడుచు పండుకొనియున్నది. వంకరలు పోవు కాళ్ళతో ఈ ప్రక్కనుండి ఆ ప్రక్కకు ఆ ప్రక్క నుండి ఈ ప్రక్కకు దొరలుచు కొట్టుకొనుచున్నది, ముఖముమీఁదనే బోరగిలి పడి యున్నది. గొంతులో గుఱుక పుట్టి ఒక విధమగు కంపుకూడ బయలు వెడలినది. ఈమె చాల జబ్బు పడియుండెననియు, చూచుటకు దిక్కెవ్వరును లేకపోయి రనియు స్థితిగతులు చెప్పకయే చెప్పుచున్నవి. కొంతసేపటికి ముసలిది తల పై కెత్తినది; ఎత్తి హీన స్వరముతో:—

"ఏమి కావలె నాయనా! ఏమి కావలెను! నీ కిచ్చట నేమియు దొరకదు."

సుదర్శనము సంగతు లన్నియు గ్రహించినాఁడు, మఱికొంచెము దగ్గఱకు వచ్చి :—"గుక్కెడు మంచి నీళ్లు" అని అర్థించినాఁడు.

ఆమె :—లేవు నాయనా! మాకు తెచ్చిపెట్టు దిక్కెవరు? మంచినీళ్లు లేవు బాబూ! వెళ్లు.

సుదర్శనము—[పడతివైపు చూపుచు]:—ఆ యమ్మను చూచుట కెవ్వరును లేరా? చాల జబ్బుగా నున్నట్టున్నది పాపము!

ఆమె :—లేరు, ఎవ్వరును లేరు. అదిగో మా ముసలాయన ఆ దొడ్డిలో చావ సిద్ధముగ నున్నాఁడు; మేమిచ్చట మరణోన్ముఖులమై యున్నాము. ఆర్చువారుగాని తీర్చువారు గాని యెవరును లేరు. ఎందులకు నాయనా, ఈ ప్రశ్నలు!

క్రొత్త మొగమును చూచిన తోడనే కుఱ్ఱవాఁడు ఏడుపు మాని మరల వృద్ధురాలి కొంగు పట్టి లాగుచు దీన స్వరముతో "మామ్మా! ఆకలే—ఏ మయిన పెట్టవే; ఇన్ని నీళ్ళయిన ఈయవే!" అని మారము సేయ మొదలిడెను.

సుదర్శన మామెను ఇంక నేమేమో ప్రశ్నింపఁ బోయెను. ఇంతలో దొడ్డిలోనున్న తాత మంచముదగ్గఱకు వత్తమను యత్నముతో గోడ నానుకొని గుమ్మము పట్టుకొని మెల్లగ రాఁబోయెను. కాని శరీరములో ప్రాణ లేనందున పట్టు తప్పిపోయి, తూలుచు కాలు జాఱి తలుపు దగ్గఱ నొక మూల పడిపోయి మఱి లేవలేక పోయినాఁడు. ఆ స్థితిలో నతడు కష్టముపైని శ్వాసము లోనికి తీసికొనుచు గంటకొక మాట చొప్పున తడఁబడుచు ఇటు లనఁగడంగెను :—

"మే మందఱము – సుస్త్రీ – పస్తు – చూడు – ఆకలి బాధ – ప్రాణములు—".

చిన్ని బాలుని వైపు వ్రేలిడి చూపుచు బోరున ఏడువసాగెను.

సుదర్శనము తన దుస్తులు విప్పి క్రింద వైచి, సంచి తీసి క్రింద పెట్టి తెఱచినాఁడు. రొట్టెతీసి అందొక ముక్క తాత కియ్యఁబోయెను. తాత పుచ్చుకొనక బాలునివైపు చూపి "వానికి—వానికి" అనెను. పిల్లవాని కియ్యఁబోఁగా అశనాతురతతో నున్న ఆ కుఱ్ఱవాఁడు రెండు చేతులును చాఁచి గభాలున అందుకొని, ఒక్క మాఱుగా నోటఁ గ్రుక్కుకొనెను. అంతట పొయి ప్రక్కనుండి ప్రాఁకి వచ్చి ఒక బాలిక రొట్టె వైపు తేఱి చూచుచుండెను. సుదర్శన మా పిల్లకు కూఁడ నొక ముక్క చేతిలో పెట్టెను. పిమ్మట ముసలమ్మ కొక ముక్క విఱిచి యిచ్చెను. ఆమె పుచ్చుకొని చప్పరింత మని యత్నించినది గాని గొంతు దిగలేదు. సుదర్శనముతో :—

"నాయనా! గొంతు లాఱుకొని పోయి యున్నవి. కొంచెము మంచినీళ్లు తెచ్చిపెట్టు బాబూ! నేను తెచ్చెద మనుకొంటిని—ఎప్పుడో జ్ఞాపకము లేదు—నిన్ననో ఈ వేళనో—అయ్యో నామతి!—కాని పడిపోయినాను. నూతి వఱకు పోలేక పోయినాను. ఎవరయిన ఎత్తుకపోకుండిరేని కడవ అచ్చటనే యుండవచ్చును" అని తప్ప తప్ప మాటలతో చెప్పినది.

సుదర్శనము నూతికి వెళ్లినాఁడు. కడవ దారిలో అగపడినది. నీరు తెచ్చి యిచ్చినాడు. ముసలి యామెయు మనుమలును మఱి కొంచెము రొట్టె తిని నీరుత్రావిరి. కాని, తాత "తినలే" నని చెప్పి వలదనినాఁడు.

పడఁతుక ఇంకను మన ధ్యానము మన లోకము లేకయే ఇటు నటు కొట్టుకొనుచు దొరలుచు పడియుండెను.

సుదర్శనము ఊరిలోనికి వెళ్ళి సామగ్రి సమకూర్చుకొని వచ్చినాఁడు. అటనున్న చిన్న గొడ్డలి దీసి పేళ్లు చీల్చి వంటచేసినాఁడు. పాపము! చిన్న బాలిక ఈతనికి వంట పనిలో అన్నియు నందించుచు చేదోడుగనుండెను. పిమ్మట జావ కాఁచి చచ్చిన జిహ్వాలు లేచివచ్చునటులు రుచ్యములగు హిత పదార్థములతో అందఱకును పథ్యములమర్చి పెట్టినాఁడు.

# ఆత్మజ్యోతి

ని

" పుణ్యమో పాపమో నీవు పూనుకొన్న
యొక్క కార్యంబు నెరవేర్చుచున్న యపుడు
మంచి చెడ్డలఁ గూర్చి యోజించు టెపుడు
తెలివి గలదేని నిన్నటి దినమునందె ! "



**ఆలోచన :** కుటీరవాసులు అన్నమారగించిన పిమ్మట సేద దీర్చికొని కాసంత స్తిమితపడినారు. పిల్లలు కంచములు నాకివేసినారు. తరువాత నొకరి యొడిలో నొకరు దూరి ఆదమఱచి నిద్రించినారు. తాతయు అవ్వయు సుదర్శనముతో తమ స్థితిగతు లిట్లు చెప్పికొనిరి :

తాత:—బాబూ ! 'గొల్లవాని కొమ్ము ఎచ్చు లేదు తగ్గులేదు' అను స్థితి మాది. ఐశ్వర్యములతో తులతూఁగను లేదు. తిండికి లేక మాఁడను లేదు. ఈ నాఁటి కిట్టిగతి పట్టినది ! మనుజులఁ బుద్ధుల బట్టియే కాలచక్ర మిటు లపసవ్యముగా తిరుగుచున్నది. పోయిన వత్సరము పంటలు పూర్తిగా తుడిచిపెట్టుకొనిపోయినవి. అందుచేత, నిలువ

చేసికొనియుంచిన గింజలు ఇంతదనుక పొంగించుకొంటిమి. ఇంటిలోని దంతయు నయిపోయినతోడనే ఇరుగుపొరుగు సజ్జనులు కొంతవఱకు సాయము చేసిరి. కొంతకాలమైన పిమ్మట వారును ఇచ్చుట మానిరి. పాపము!వారికే లేనిది మా. కేమీయఁగలరు! ఇక తఱచు వారిని వీరిని అడిగి లేదని పించుకొనుట సిగ్గుగా తోఁచినది. అప్పటికే ప్రతివారికిని —ఊరిలో—ఉప్పో పప్పో బియ్యమో ఏదోయొకటి అప్పు తీర్పవలసియే యుండెను. చేబదుళ్లకు లెక్కయే లేదు. పోనీ, కూలికి పోవుద మనిన పని దొరకదు. ఇట్టి కాటక ములో పని దొరకుట మేరువు లభించుటగాదా? మెతుకు కన్నులఁబడునా దేవుఁడా! అని యనిపించినది. అదృష్టము వల్ల ఒక్కనాఁడు పని దొరకిన మూఁడురోజులు నాగా.

కుఱ్ఱదానిని వెంటఁబెట్టుకొని ముసలిది యాచనకై దగ్గఱ నున్న యూళ్లకు వెళ్లినది. లక్షాధికారులు కూడ పిడికెడు గింజలు ముష్టివేయుటకు టకటక లాడసాగిరి. అందు చేత ఆ విధమునను పొట్ట పోసికొన లేకుంటిమి. ఒకరి కున్న రెండవవానికి లేకుండెను. ఈ ప్రకార మెట్లెట్లో కొంత కాలము జీవములు నిలుపుకొనఁ గలిగితిమి. పునాస పంటలు పండినచో కొంత ఆధారము కలుగునేమో అని యాశించి తిమి. కాని అదియు సున్నయై గోరుచుట్టుపైని రోఁకటి పోటు పడినది. అటు పంటలు, ఇటు మా యాశలు కూడ

నంతరించినవి. అంతట వర్ష కాలము తిరిగినది. మా యవస్థ ఏమని చెప్పుదును? ఒక పూఁట గంజి యున్న, వారము రోజులు పస్తు. ఇట్టి స్థితిలో ఇది యది యనకుండ. ఏ గడ్డి లభించిన ఆ గడ్డితోనే పొట్టలు నింపుకొనుచుంటిమి. ఇందు చేతనో మఱెందుచేతనో కాని, మా ముసలిది పడిపోయినది. నాకును క్రమముగాం శరీరపాటవము తగ్గి ఈ స్థితికి దిగినాను.

అవ్వ:—నాయనా! పూర్వకాలపు దాన నగుటచే కుటుంబములో నెల్ల నేనే కొంచె మెక్కువ కాలము తిరుగు లాడఁ గలిగితిని కాని, అన్నసారము లేక శరీరము శుష్కించి వరుగనై పోయితిని. చేతులు అప్పడము వలె పొట్ట నంటి పట్టుకొని కుట్టు దెట్లున్నదో చూఁడు. చేయి చాఁపుట యనిన దానికి ప్రాణకంటకము. అందుచే కాళ్లు కడుపులో పెట్టుకొని ఆమూల నటులే పండుకొనియుండును. బాబూ! ఏ జన్మలో ఎవరి కూడు పడగొట్టినామో! ఈ నగుమనే పొరుగమ్మలు వచ్చి తొంగిచూచి పోయినారు. ఇది మాస్థితి. మరణ దేవత నను క్షణమును ఆరాధించుచు వేచియున్నాము.

ఇదంతయు సుదర్శన మాలించినాఁడు. "ఈ పూట కిఁక దీక్షితులను కలిసికొనుట పడనట్టున్న" దనుకొని రాత్రి అక్కడనే ఉండి పోయినాఁడు. తెల్లవాఱినతోడనే

ఇంటి యాధిపత్యము వహించి తాతను బియ్యము కడుగ నియమించి, తాను నిప్పు రాజ బెట్టినాడు. ఇంటిలో తినుబండారములు గాని గుడ్డలుగాని ఏవియు లేవు, అన్నియు నీ వఱకే అయిపోయినవి. అందుచేత బాలికను కూడ బజారునకు తీసికొని వెళ్లి ముఖ్యమగు వస్తువులు సేకరించి తెచ్చినాడు.

ఇవ్విధమున సుదర్శనము మూడు దినములు గడపి నాడు. అప్పటికి కుఱ్ఱవానికి కాసంత జవము చేరినది. క్రొత్త వదలి సుదర్శనముతో కలసిమెలసి సంచరించుచుండెను. పిల్లకు కళాకాంతులు కల్గినవి, "తాతా! తాతా!" యనుచు సుదర్శనమును వదలక మిక్కిలి చనవుగ మసలు చుండెను. ముసలి యామెకు తనంత తాను ఇరుగు పొరు గిండ్లకు పోవగల శక్తి వచ్చినది. కఱ్ఱ ఊతగొని తాత కొంచెము అడుగులు వేయగలిగెను. తీవ్ర జ్వరముచే పడతి మట్టుకు అటులే యుండెను. కాని ఉష్ణము దిగజాఱి మూడవనాడు దప్పిక పోయుమని కోరినది.

"అయ్యో! ఇప్పుడైన బయలుదేఱి పోవలెను, ఎంత జాగయినది!" అని సుదర్శనము తీవ్రాలోచనములో బడెను.



# ఆత్మజ్యోతి

## ౬

"ప్రాణ మిత్రమ! నను విడనాడు నపుడు
నే నెఱుఁగకుండ దొంగతనానఁ బొమ్ము!
నా కెపుడుఁ గూడ నీ ప్రయాణమును గూర్చి
కొంచెమైనను సూచింప నెంచబోకు!"



మరలు ముఖము :

సుదర్శనము వెళ్లిపోవుద మనుకొన్న నాల్గవ దినము భోగి పండుగ. ఇంతయుఁ జేసి పండుగపూఁట వీరి నీ స్థితిలో వదలివేయుటా? యని తోఁచి, ఈ పండుగ మూన్నాళ్లును వారితోఁ గడపుటకు కృతనిశ్చయుఁ డైనాఁడు. బజారునకు వెళ్లి పిండివంటలకు వలయు సంభారము సమకూర్చి ముసలమ్మ కిచ్చినాఁడు. తెల్లవారు జాముననే బిడ్డలిద్దఱును తలలంటుకొని ముస్తాబులు చేసికొనినారు. సుదర్శనము వీరలను ఆలయమునకు తీసికొని వెళ్లి దైవసందర్శనము చేయించినాఁడు. నాఁడు పడతుక కొంచెము నీరసముగ నుండినను లేచి, తప్పటడుగులు వేయఁ గల్గెను.

తాత క్షురకర్మము గావించుకొని అవ్వ ఉతికియుంచిన శుభ్రమగు చొక్కా తొడుగుకొని, ఆ యూర పెద్ద వ్యవహారస్థుడగు నొక 'సాహుకారు'నొద్దకుఁ జనెను. ముసలివాని భూములును బీడులును ఈ సాహుకారునొద్దనే తనఖాలో నుండెను.

"అయ్యా! ఈ యేఁడు నా భూమి కౌలునకు దయ చేయింపుఁడు. మిక్కిలి చిక్కులలోఁ బడి యున్నాను, లేనిచో నోరు తెఱచి ఒకరి నడుగవలసిన వాఁడను గాను. కోటి రూపాయ లిచ్చినట్లు సంతోషించెదను, మీ పేరు చెప్పుకొని పిల్లలు నేను ఇన్ని గంజినీళ్లు త్రావెదము" అని అర్థించినాఁడు.

అందులకు సాహుకారు—"వడ్డీతో ముందు డబ్బు తెచ్చి మఱి మాటాడుము. పిల్లలవాఁడవు కదా యని ఇంతవఱకు కనికరించితిని. ఇఁకముందు దయలు కుదురదు. వ్యవహారము చేయి దాఁటిన తరువాత ఏమనుకొన్నను లాభము లేదు. అనవసరముగ నన్ను రచ్చకెక్కింపక తెఱపి చేసికొమ్ము, పొమ్ము."

తాత మానధనుఁడు. అందుచే మఱి మాటాడలేక "అయ్యో!" అని నిస్పృహత చెంది, మెల్లగ సాయంకాలమున కింటికిఁ జేరుకొనినాఁడు. అదియుఁగాక పేదవాని

కోపము పెదవికి చేటు తప్ప వేఱేమున్నది? శ్రీమంతులకు అచ్చియున్నను చిక్కే, ఇచ్చియున్నను చిక్కే!

ఇవన్నియు కని మరల సుదర్శనము తీవ్రాలోచనములో పడెను: "వీరికి జీవనోపాధి యేమి? తోడి వారెల్లరును వ్యవసాయపు పనులలో కొట్టుకొనుచుండ తాత చేతులూఁపుకొనుచు కడుపు చేతఁ బట్టుకొని కూర్చుండవలెనే! తన భూమి సాహుకారునకు తనఖా పెట్టుట వలనఁ గద ఇట్టి దురవస్థ సంభవించినది! ఈ పట్టున నేను వెడలిపోయినచో పాపము! వీరి గతి యథాప్రకారమే కద!" అని తలపోసెను.

ఈ చిక్కు లన్నియు పరికించి, పండుగ మూఁడు రోజులును ఉండి స్థితిగతులు చక్కఁబడిన వెనుక బయలు దేఱుదమనుకొని, పూర్వపు టుద్దేశము మార్చుకొనినాఁడు. పెరటిలో పరుండమని వెళ్లి ప్రార్థనానంతరము కనుమూసినాఁడు; కాని కునుకురాదు. ఒక మూల ప్రయాణము సాగింత మను తొందర. ఇంతవఱకును అమూల్యమైన కాలమును విశేష ధనమును వెచ్చించినాఁడు, ఇంత చేసినను విచారము తొలఁగ కున్నది.

"ఎంత అవివేకము! ఎంత వెఱ్ఱి నైతిని! ఎందఱికని నే నిట్లు సాహాయ్యము చేయఁ గలను! వారికి నీరాహారము

లిచ్చెద మని కద తొలుత తలంచితిని? ఇపు డే స్థితిలో నున్నాఁడను?"—అని విచారింపఁ గడంగెను.

"ఇఁక—భూమి తనఖా విడిపించి తాతకియ్యవలెను. లేకున్న వారికి జీవనోపాధి లేదు. చిన్న బండి యని, కాఁడి పశువులని, పిల్లల పాల నిమిత్త మొక ఆవని, ఇట్టివన్నియు తప్పదు కద! సుదర్శనమా!—ఉరిలో తగులుకొంటివిరా! నీ తీర్థయాత్రా నావకు లంగరు వేసితివి. వేగిరము బయలు దేఱి వెళ్లుటకు తంటాలు పడుము" అనుచు తనలో తాను ప్రసంగించుకొనెను.

ఏమియు పాలుపోయినది కాదు. పొడుముకాయ తీసి ఒక్క పట్టెక్కించినాఁడు. అప్పటికిని ఏమియు స్ఫురింప లేదు. ఆలోచించినాఁ డాలోచించినాఁడు; ఎట్టి నిర్ధారణ మునకును రాలేక పోయెను. ఇటనుండి వెడలిపోక తప్పదు, వీరల నీ స్థితిలో విడుచుటకు మనసొప్పదు, ఏమి చేయుటకును తోఁపదు! తిరుగ బట్టలన్నియు చుట్టఁబెట్టి తల క్రిందఁ బెట్టుకొని పరుండినాఁడు. తెల్లవాఱు జాము దనుక సుదర్శ నమునకు కోడికునుకు పట్టినది. అంతట హఠాత్తుగ నెవరో లేపినట్లయి, అపుడిట్లొక కల గాంచినాఁడు:

"దుస్తులు ధరించి ఒక భుజమున సంచియు చేత బెత్తమును పట్టుకొని వెడలిపోవుద మని బయలుదేఱి

గుమ్మము వఱకు వచ్చినాఁడు. గుమ్మము దాఁటుదమను కొను నంతలో ఒక తలుపు చేర వేసి యుండుటచే ఇఱుకై—సంచి తలుపునకు, పంచెచెంగు ద్వారబంధమునకును తగు ల్కొనినవి. అందుచే ఊడి యీవలఁ బడ ననువు కాక పోయెను.'

కను విప్పి చూడఁగా—గుమ్మమును తగులుకొన లేదు, తలుపును తగుల్కొన లేదు. ఒక ప్రక్క సంచిపట్టు కొని బాలిక వ్రేలాడుచు "తాతా! చిన తాతా! ఏ మయిన పెట్టవా?" అని మారము సేయుచుండెను. కుఱ్ఱ వాఁడు పాదముల యొద్ద కూర్చుండి బిక్కమొగముతో పంచె చెంగు పట్టి లాగుచుండెను.

అంతట సుదర్శనము మెలఁకువ తెచ్చుకొని ఇట్లు నిశ్చయించుకొనెను :

"రేపటి దినమున ముసలివాని పొలమును బీడును తనఖా విడిపించెను, ఒక బండియు జత ఎడ్లను కొనెదను, పిల్లల పాలకు చిన్న గోవును పుచ్చుకొనెదను, పెద్ద పంట పండువఱకు సరిపడు ఇంటి సామగ్రి తెచ్చెదను. లేకున్న నా బొంది తీర్థయాత్రకు పోయినను ఆత్మ మాత్ర మిచ్చటనే నిలిచి యుండును! వీరలకు సాయము చేసి తీఱుటయే నా విధి" అను దృఢ సంకల్పముతో తిరుగ నరుణోదయము

వఱకు నట్టి నిదుర పోయి, లేచి కాలకృత్యములు తీర్చు కొని పెద్దపందుగనాఁడు సుదర్శనము సాహుకారు నొద్దకుఁ జనెను.

వడ్డీకి వడి గుణ్ణములు చాలవు! 'విడువు మనిన పామునకు కోపము, పట్టు మనిన కప్పకు కోపము' అను నట్లుండుట సహజము కద వ్యవహారములలో! అయినను ఏదో యొక విధముగా తన జామీనుపైని వ్యవహారము పరిష్కరించి, తాత భూమి తనఖా విడిపించి సుదర్శనము దఖలు పఱచుకొనినాఁడు. తరువాత ఒక కొడవలి కూడ కొనినాఁడు. అయ్యో రామ!—చివరను ముసలివాఁడు కొడవలి సయితము విక్రయించి పొట్ట పోసికొనవలసి వచ్చినది!

చెల్లు పెట్టి విడిపించిన పత్రములును కొడవలియు ఇంటికి తెచ్చి తాత కిచ్చి "తాతా! ఇఁక నీ పొలమునకు పోయి గడ్డి కోసి తెచ్చుకొనుము" అని చెప్పి వానిని పంపి, సుదర్శనము తిరుగ ఊరి లోనికి వెళ్లెను. సత్రము దగ్గఱ ఒక బండి అమ్మకమునకు రాఁగాఁ జూచి బేరము చేసి దానిని కొనెను.

నాఁడే ఆ యూర పసువుల సంత అగుటచే వెంటనే మంచివి కాఁడి యెడ్లు సులువుగ జతపడినవి. ఆ యెడ్లను

క్రొ_త్తగా కొనిన బండికి పూనిపించి, దానిపై నొక ఉలవల బస్తా వేయించి ఇంటికి తోలించుకొని వచ్చుచుండెను. ఆవును కూడ ఆపట్టుననే కొని, మఱి యింటికి మరలుద మని అతని సంకల్పము.

కాని త్రోవలో తన్నుఁ జూచి ఇరువు రిట్లు ప్రసంగించుకొనుట సుదర్శనము చెవులఁ బడినది :

"అదిగో, ఆ బండిపై నున్నాయనను చూచితివా ! ఏమో, మన బోఁటి వాఁడే కాఁబోలు ననుకొంటిమి. తాత ఇంటికి కొంచెము దాహ మిమ్మని వచ్చినాఁడట, వచ్చిన వాఁడు అట్టులే ఉండిపోయినాఁడు. అబ్బోరి నాయన! ఎంత సామగ్రి యెంత సామగ్రి! ముసలిహాని ఇల్లంతయు నింపి వేసినాఁడురా, ఎంత యదృష్టమో కాని!—ఆహా! సత్రము దగ్గఱ బండి బేరమునకు రాఁగా అది కొని, అదిగో ఆ యెడ్ల జత నమర్చి, తాత కిచ్చుటకు కొంపోవు చున్నాడు. ఏమి సత్యకాలమురా! నాకు మహాశ్చర్యముగ నున్నది!"

"ఓహో! ఇదంతయు నన్నుఁ గూర్చియే కద" అని యనుకొని—పొగడ్తలు సహజముగ సహింపని సుదర్శనమునకు మనసు విఱిగి—ఇఁక గోవును కొనకుండుటకు నిశ్చయించినాఁడు. తిన్నగా బండి మరలించి కుటీరము చేరినాఁడు. గుమ్మములో బండి ఆఁపి అతఁడు దిగిన తోడనే.

అచ్చటి వారెల్లరును విస్మితు లయిరి. ఈ బండి తమకొఱకే తెచ్చియుండునని ఇంటి వారనుకొన నవకాశ మున్నది, కాని అటు లూహింప వారు సాహసింప లేకపోయిరి.

తాత వచ్చి "బాబా! ఎక్కడిది బండి!" అని ప్రశ్నించెను.

సుదర్శనము :—చవుకగా పోవుచుండుటఁ గని కొని నాను. గడ్డి తెచ్చియుంటివి కాఁబోలును, ముందు ఎడ్ల నా పంచను కట్టి ఇన్ని పరకలు పడవేయుము. ఈ యులవల సంచి అటకపై కెక్కించుము.

తాత ఎడ్లను విప్పి వానికి గడ్డి వేసి, సంచి జాగ్రత్త పెట్టెను. సామాను తన కూడనే యుంచుకొని సుదర్శనము మామూలుగ పెరటిలో పండుకొనఁ బోయెను. నాఁటి రాత్రి ఎల్లరును ఒడలు మఱచి హాయిగ నిద్రించిరి.

ఇట్టి సమయమున సుదర్శనము మూటయు ముల్లెయు సరదుకొని, మిత్రుని కలసికొందమను ఆత్రముతో దారిఁ బట్టెను. తిరుగ ఆ యూరి ప్రజ కంటఁబడినచో పయనమున కడ్డంకి కలుగునేమో యని పిట్టకయిన తెలియకుండ విస రుతో కాలు సాగించెను.



# ఆత్మజ్యోతి

## ౭

“పుష్పించి, ఫలియించి, భూత సంతతికిఁ
గడుఁ బ్రియం బొనరించు ఘన తరులట్లు
పరమోపకార భవ్య క్రియా తతికిఁ
బాల్పడు వారి జీవనమె జీవనము!”



**భూతల స్వర్గము :** కాకులు కూయు నప్పటికి సుదర్శనము మూఁడు మైళ్లు సాగి, అట నొక వట వృక్షము క్రింద కూలఁబడి మూట విప్పి సొమ్ము సంచి తీసి లెక్క చూచినాఁడు. చూడఁగా పదునాలు రూపాయల పావులా మాత్రమే మిగిలి యున్నది.

సుదర్శనము ;—“సరి సరి. ఈ ధనముతో ఏపాటి దూర మేఁగఁ గలను? పోనీ, వారిని వీరిని ఆశ్రయించి ఎటులో యాత్ర సాగింత మనిన, ఇది లేని పాతకము కొని తెచ్చుకొనుట యగును. దీక్షితులు వెళ్లినాఁడు కద! నా స్థానమునఁ గూడ నతఁడే అభిషేకములు చేయించును. ఇఁక నా సంగతియా? శపథము చెల్లించుకొన లేకపోయితిని.

గదా యను చింత ఆజన్మాంతము ఉండిపోవును. ఏమి చేయఁ గలను? దీన దయాళూ! పరాత్పరా! మహా పాపిని. నీ సందర్శన భాగ్యమునకు నోఁచుకొననైతి. క్షమింపవా!" —అని నిష్కల్మష హృదయముతో నశ్రువులు రాల పశ్చాత్తప్తుఁడై తిరుగ లేచి, ఇంటివైపు మరలెను.

మిత్రు లిరువురును మొదట బయలు దేఱినపుడు నడకలో దీక్షితులను కలసికొన లేకపోవుటచే ఇతనికి కొంచెము కష్టముగనే తోఁచినది. కాని ఇపుడో! ఇంటి ముఖము గనుక మున్నెఱుఁగని నూత్నశక్తి ఆవహిల్లినది. శ్రమ యను మాట లేక ఉల్లాసచిత్తుఁడై, చేతికఱ్ఱ యూఁతు కొనుచు ఱివ్వు ఱివ్వున మజిలీలు దాఁటుచు అనతి కాలములో నిలు సేరెను.

సుదర్శనము ఇంట కాలు పెట్టుసరికి—కనుపండువుగ పెరటిలో కళ్లముపై పైరు కుప్పలు నూర్పునకు సిద్ధముగ నున్నవి. ఆవులు ఈనుటచే పాఁడి వ్యాపారము పుష్కలముగ జరుగుచున్నది. ఇంటిలోని వారి యానందమేమని చెప్పఁ గలము! తాత దర్శనము వారికి విష్ణుసందర్శనమైనది. అతఁడు వచ్చి తన పడుకకుర్చీపై సుఖాసీనుఁడైనప్పుడు ఇల్లెంతో నిండుగ నుండి భూతల స్వర్గముగ తోఁచినది.

ఇఁక—" నీ వెంతవఱకు వెళ్లినావు తాతా?"—" ఏ మేమి చూచినావు?"—" దీక్షితులుగా రేరి?"—" నాయనా! నీవు తిరిగి వచ్చితి వదేల?"—అనుచు ఎంతో ఆత్రముతో నిట్టి ప్రశ్న పరంపర సుదర్శనముపై కురియించి ఇంటి వారాతనికి ఊపిరి యాడనీయలేదు. ఈ ప్రశ్నల న్నిటికిని సంగ్రహముగా క్రింది జవాబు నిచ్చి సుదర్శనము ఎల్లరను తిరుగ నోరెత్తకుండఁ జేసినాఁడు :

" పరమేశ్వరుని ఆజ్ఞ అట్టిది. ధనమా దారిలో వెచ్చించితిని. మిత్రుని వదలుకొంటిని. అందుచే అనుకొన్న ప్రకారము వెళ్లలేకపోయితిని. మీ పుణ్యమా యని ఇఁక నన్నేమియు అడుగ వలదు. ఇంతకంటె ఇతరము చెప్పఁ దలఁచుకొన లేదు."

'వచ్చియు రాని మాటలు రుచి, ఊరియు నూరని ఊరుఁగాయ రుచి' అనునట్లు చంటి బిడ్డఁడు—" నన్ను తీసికొని వెళ్లకపోయినప్పుడు మ తేమగును నీ పని?" అని చిట్టి చిట్టి పదాలతో నాయనను దెప్పిపొడువఁగా, ఎల్లరును నవ్వఁ జొచ్చిరి.

సొమ్ము సంచి భార్య చేతి కిచ్చి ఇంటి సమాచార ములు తెలుపఁగోరెను. " అంతయు ననుకూలముగనే యున్నది. వ్యవసాయపు పనులు తరుణమున తగుశ్రద్ధతో

జరుపఁబడినవి, ఏమియు చెడిపోలేదు. గృహములో నెల్ల రమును ఎట్టి కలఁతలు లేక ఐకమత్యముతో శాంతముగ కాలము వెళ్లఁ బుచ్చుకొను చున్నాము'' అని పూస గ్రుచ్చి నట్లు భార్య క్షేమవార్తలు చెప్పెను.

సుదర్శనము తిరిగివచ్చిన సంగతి ఆనోట ఆనోట ప్రాకి దీక్షితుల గృహములో తంతివార్తవలె మ్రోఁగినది. తెలిసినదే తడవుగ దీక్షితుని సతి సుదర్శనము కడకు తొందరగా వచ్చి ఎంతో ఆత్రముతో తన భర్తను గూర్చి ప్రశ్నించెను. ఇంటిలోని వారి కేమి సమాధాన మిచ్చెనో ఈమెకును అదే ప్రత్యుత్తరమిచ్చి, సుదర్శనము మఱియు నిట్లనెను:—

''అమ్మా! సంక్రాంతికి ముందు ఒకవారము వఱకును ఉభయులము కలసి వెళ్లితిమి. మీ వారు క్షేమముగనే యుండిరి. పిమ్మట వారిని కలసికొంద మనుకొంటినిగాని సొమ్ము దారిలో వ్యయమైపోయినందున ముందునకు సాగిపోవ నవకాశము లేక ఇంటికి మరలితిని.''

''ఏమో అనుకొంటిమి! అయ్యో! వీని తెలివి కాలిపోను! ఇంత అజ్ఞాన మేమి చెపుమా! మతిపోయినదా?— యాత్రార్థియై బయలుదేఱి కడవఱకు వెళ్లలేకపోయినాఁడు. పోనీ! సొమ్మంతయు సగము దారిలోనే వెచ్చించుకొనుటు

ఏటి వింత!''—అనుచు పలువిధముల పరిహాసించుచు లోకులు చెప్పుకొనఁ దొడఁగిరి.

కొంతకాలము కీగొడవ ప్రాఁతవడినది. ప్రజయు దాని ప్రసక్తి మానినారు. సుదర్శనముకూడ యాత్రను గుఱించిన విషయము లెఁక తలపెట్టక గృహకార్య నిమగ్నుఁ డయ్యెను. సుదర్శనమా!—

"గొడవ లన్నియుఁ దీర్చు గోపాలమూర్తి
నీ పాల నుండఁగా నీ కేమి భయము!"

# ఆత్మజ్యోతి

౮

"ఎవని చిత్తంబు నీ చిత్త మేకమగునో
ఎవని జీవంబు నీ జీవ మేక మగునో
ఎవని వృత్తంబు నీ వృత్త మేక మగునో
యాతఁడే చుమ్ము నమ్ము నీ యాత్మసఖుఁడు!"



**పాత్ర పరిచితి :**

నాఁడు—సుదర్శనము, గుడిసెలోని దరిద్ర నారాయణులను సేవించుచున్న సమయాన—దీక్షితులు కొంచెము దూరము వెళ్లి అచ్చట ఆఁగి విశ్రాంతి గొనుచు మిత్రుని కొఱకు వేచియుండెను. కనుపెట్టుకొని కనుపెట్టుకొని ఒక నిద్దుర తీసి, లేచి మఱి కొంతసేపు నిరీక్షించెను, కాని సుదర్శనుని దర్శనము కాలేదు. చూచి చూచి కన్నులు కాయలు కాచినవి. సూర్యాస్తమయ మయినను మిత్రుని సందర్శనము కాలేదు.

ఎంతకును అతఁడు రాకపోవుటవలన తాను నిద్రించునపుడు తన్ను కానకుండ ముందుకు సాగిపోయియుండునని

దీక్షితులు నిశ్చయించి మిత్రుని కలసికొనవలెనను అభిలాషతో తొందరగ ముందుకు నడువ సాగెను.

అతఁ డట్లు అవతలి పల్లె చేరుకొని తన మిత్రుని రాక విషయమై గ్రామపు పెద్దను కనుఁగొనఁగా ఇంతవఱకును ఆ యూరికి క్రొత్తవా రెవ్వరును రాలేదని తెలిసినది. సత్రములో బస చేసెద ననియు, ఫలాని ఫలాని మోస్తరు వాఁడు గ్రామములోని కరుదెంచినచో తనయొద్దకు దారి చూపుఁ డనియు కోరి దీక్షితులు వెళ్లెను.

ఆ పూఁట చూచి మరల ప్రయాణము సాగించుచు, దారిలో కనఁబడినవారి నెల్లరను—"అయ్యా! మీరు వచ్చినదారిలో నెవరయిన పొట్టియతఁ డగపడినాఁడా? బట్టతల, చామనచాయ, చెవులకు పోఁగు లుండును; దంతపు పిడి వేసిన కత్తికట్ట చేత నుండును..."అని ఆనవాళ్లు చెప్పి వాకబు చేయుచుండెను. ప్రతివారును "మాకు తెలియదు, మేము చూడలేదు" అనుచుండిరి. దీక్షితుల కి దంతయు నాశ్చర్యముగనే యుండెను. కాని అతఁ డేమి చేయఁగలఁడు? అటులనే సాగిపోవుచుండెను.

దారిలో ఛత్రపురము దగ్గఱ దీక్షితులకు సహాయయాత్రికుఁ డొకఁడు జతపడినాఁడు. తీర్థయాత్ర కితని కిది మలుసారి. కొంత సేపటి కిద్దఱకును దోస్తీ కుదిరినది. వారు పరస్పర సహాయభూతులై మైత్రితో వర్తించు చుండిరి.

దీక్షితులు మొట్టమొదట పూరీ క్షేత్రము సేవించి కాశీ మొదలగు స్థలములకుఁ బోవఁ దలఁచెను. కాని క్రొత్త స్నేహితుని ప్రోద్బలమువలన తిరుగుదలలో జగన్నాధ దర్శనము చేయుటకు నిశ్చయించుకొనెను. మొదట వారు కలకత్తాలోని కాళీమాయిని దర్శించుటకు సంకల్పించిరి. తాము పోనున్నది కడు దవ్వగుటచే కొంతవఱకు రెయిలు మీఁదఁ ప్రయాణించుటకు నిశ్చయించి. చిలకసముద్రము తరువాత వారు రైలు నెక్కిరి.

ఈ సందర్భమున, మన దీక్షితుని నూతన స్నేహితుని గుఱించి ఇంచుక తెలిసికొనక తప్పదు: అతని పెద్ద తల, ఎఱ్ఱని గుంటకన్నులు, చేవ దేరిన నల్లని ముష్కర శరీరము, శుష్కహాసము, అతని స్వభావమును చాలవఱకు వ్యక్తపఱచుచునే యుండెను. పేరు సత్యనారాయణ, కాని నోరు విప్పిన అన్నియు నసత్యములే. ఎట్టి దుర్మార్గమున కును అతఁడు వెనుకంజ వేయఁడు. ఎందఱి తలలనో పగులఁ గొట్టినాఁడు, కుసంఘములతోఁజేరి ఎందఱి మానములనో హైరచినాఁడు. అతఁడు ఆర్పిన దీపములు కాలాగ్ని శిఖల వలె అతని కనుల ముందు అపుడపుడు గోచరించుటచేఁత మనశ్శాంతి లేక మున్నొక పరి తీర్థముల సేవించియుండెను. కాని తన దుస్వభావము పూర్ణముగ మారకుండుటచేఁత

ముఖల దుష్కృత్యము లెన్నో చేసి ఇపుడు రెండవసారికూడ యాత్రికుఁడై వెడలినాఁడు.

అలవాట్లు—అందును చెడ్డవి-మరల్చుకొనుట దుష్కరము. వృశ్చికము పాపము! తన దారిని తాను పోవుదమని యనుకొనును, కాని అభ్యాస బలముచే కొండితో రవంత ఇట్టె యనకుండ నుండలేదు. సత్యనారాయణ పుణ్యమార్జించుకొందమని అమిత శ్రమ పడుచున్నాఁడు, విబుధులతో చేరి సత్ప్రవర్తనమునకు యత్నించుచున్నాఁడు. కాని మునుపటి అలవాట్లు వల దనినను మానక అప్పటప్పట పొడసూపుచుండెను. రక్షించువానినే భక్షింపు మనుపటులు, తనకు మేలు చేయువారికే అతఁడు కీడు తలపెట్టును.

ఇఁక ప్రకృతమునకు వత్తము :

స్టేషనుకు వచ్చినారు మిత్రులు. సత్య మనినాఁడు కదా!—"అయ్యా! దీక్షితులుగారూ! డబ్బు విషయమై మీరు తగు జాగ్రత్త పుచ్చుకోవలె, మున్ముందు మిక్కిలి ఇబ్బంది పడిపోవుదుము. [రహస్యముగా]—ఇదిగో చూడుఁడు! టిక్కెట్ల కొఱకు అనవసర వ్యయము చేయకుఁడు—చిన్న సంగతి : తగిన కంజాయింపు చేసియే యున్నాను, మాటాడక రెయి లెక్కుడు. తరువాతి సంగతి నే చెప్పెదను గాదా! 'గేటు'నకు ఆవలి ప్రక్కనుండి తిరిగి వెళ్లి ప్లేట్ఫారము' పైని కూర్చుందము రండు!" అనెను.

దానిపైని దీక్షితులు చివాలున లేచి—

"ఏమండోయి! ఇప్పు డనిన అంటిరి గాని ఇట్టి యుక్తులు ఇకెప్పుడును నా చెవిని వేయకుండు! ఏమున్నది? నేఁడు చచ్చిన రేపటికి రెండు; మర్యాదగ బ్రతుక వలెను. జన్మాంతమున మిగులునవి కీర్త్యపకీర్తులు రెండే. సొమ్ముతో పని లేదు. సొమ్ము మనల గడించినదా యేమి? నేను వలయు డబ్బు చేతఁ బట్టుకొని మఱి బయలుదేఱినాను. నా యెత్తున రత్నములు పోసినను మోసము చేయ సాహసింపను. అట్టి తుచ్ఛపు వర్తనమునకుఁ గడంగ మన సొప్పదు. మీ చేరిక వలన నాకు నగుబాట్లు వచ్చునట్లున్నది. మీ సంగతి మీరు చూచుకొనుఁడు; నేను మాత్రము టిక్కెట్టు కొనక మానను"—అనుచు ఇంకను ఏమేమో అనఁబోవు చుండఁగా, తన పాచిక పాఱలేదు కదా యని, సత్యనారాయణ మెత్తపడి—"నా కేమి నడుమను? మీ యిష్టప్రకారమే కానిండు. బుద్ధి గడ్డి తిని ఏదో అంటిని, ఇఁక నోరు చేయకుఁడు, నలుగురును ఆలకించిన బాగుగా నుండ" దని చెప్పి, దీక్షితుని ఊరకుండఁ జేసెను.

దీక్షితులు రెయి లెక్కినాఁడు. టిక్కెట్టుండెనో లేదో ఆ గొడవ మన కెందులకుఁ గాని—సత్యనారాయణ కూడ అతని వెంబడి వచ్చుచునే యుండెను.

సాయంకాలము వఱకును ప్రయాణము ఖులాసాగానే సాగెను. దీపాలవేళ అయినది. అంతవఱకు నెచ్చట డాఁగి యుండెనో! మేఘము లిట్టె క్రమ్ముకొనినవి, వడగండ్ల వాన కడవలతో కుమ్మరించినట్లు కురిసినది. పిడుగులు——ఉఱుములు——మెఱుపులు!——వీని హడావుడికి రెయిలులో నున్న పసిపాపలు గ్రుక్క త్రిప్పక ఎంత యేడ్చిరో ఊహింపఁ జాలము. జవ సత్వములు గల పడుచువారే దారి తెన్ను కానక బెదరిపోయి రనిన, ఇఁక నిరంతర పర సాహాయ్యా పేక్షకు లగు శిశువుల గతియు వయసు మళ్లినవారి సంగ తియు వేఱుగఁ జెప్పవలెనా!

బండి స్టేషను దాఁటి సగము దారిలో నుండఁగా ఈ విపత్తు సంభవించుటచే ముందుకు త్రోసికొనిపోవుటకుఁగాని వెనుకకు మరలుటకుఁ గాని అవకాశ మెంతమాత్రము కనఁ బడదు. అందుచే బండి అచటనే నిలచిపోయెను. 'డ్రైవరుల' చాకచక్యమును 'గార్డు' అధికారమునుకూడ ప్రకృతి యొక్క అఖండ శక్తిముందు దిగఁదుడు పయినవి. దైవ బలమే అమోఘమను సూక్తి పలువురు నాస్తికుల హృదయ ముల నాటి గర్వపరిహారము గావించెను. ఏ రూపముననైన నేమి!——రెయిలులోని వారెల్ల రును ప్రకృతి స్థితిలో చేయఁ జాలిన దొక్కటే! ఏమది? జ్ఞానము వచ్చి నప్పటినుండియు ఎన్నెన్ని దుష్కృత్యము లొనరించిరో నెమరునకు తెచ్చు

కొని అన్నిటి కన్న కన్నీటి బొట్లు వదలి హృదయ భారము తగ్గించుకొనుట! అదే ఇపుడు వారు చేయుచున్న పని!

ఏమి కానున్నదో అని దీక్షితులు కూడ లోలోన బెగ డొందుచు ప్రాణములు పిడికిటిలోఁ బట్టుకొనియే యున్నాఁడు. పైకి మాత్రము మహా విరాగివలెను జ్ఞాని వలెను లేనిధైర్యము తెచ్చిపెట్టుకొని గంభీరుఁడై యుండెను.

మఱునాఁడు రెండు జాములవఱకును వర్షము ఒక్క పెట్టున కురిసినది. పాలు లేక బిడ్డలు సొమ్మసిల్లిరి. తల్లులకు తిండి యున్నఁ గదా పిల్లలకు పాలు! ముసలివారు కన్నులు తేలవైచిరి. తమ బలాతిశయములకు విఱ్ఱవీఁగు జవ్వనులు సయితము కన్నులు లోఁతునకు పోయి,—వ్రేలఁ బడిన ముఖములతో,—కడుపులో ఏదయిన ఇంత పడునా? యని పలవరింపు చుండిరి.

పరమేశ్వరుఁడు కటాక్షించినాఁడు. నియత ధర్మము కనుక తప్పులకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేయునే గాని ఆ దయామయుఁడు మాత్రము తన బిడ్డల ఇబ్బందులు చూచి సహింపఁ గలఁడా!

క్రమముగా మబ్బులు పటాపంచలైనవి. ఆకసము నిర్మల మయినది. సూర్యభగవానుఁడు తిరుగ దర్శన మిచ్చినాఁడు. ఎల్లరును పునర్జన్మ మందిన ట్లెంచి ఈ యనుకూల వాతావరణము కని 'గండము తప్పిన' దనుకొని సంతోషిం

-చిరి. చిదిమినను నెత్తురు లేని ముఖము లిపుడు ఎఱ్ఱవాఱఁ జొచ్చినని.

రైల్వే కంపెనీవా రనుక్షణమును సంగతులు తెలిసికొనుచుండిరి. నీట మునిఁగి యుండుటచే పట్టాల ఆనవా లింకను తెలియనందున బండి నడపుటకు తగినంత ధైర్యము చిక్కలేదు. ఇంతలో ప్రక్క స్టేషను నుండి ఒక 'స్పెషల్' బండి రెండు పెట్టెల నిండ తినుబండారపు సామానులతో వచ్చినది. అటుపైని పరిస్థితు లెల్ల ప్రయాణికులకు సుముఖముగనే యుండెను!

కడకు మన మిత్రులు కలకత్తా చేరిరి. హౌరా స్టేషనులో దిగి కలకత్తా పట్టణ వైభవమునకు అచ్చెరు వందుచు అందలి వింతలను పరికించిరి. కాళీఘాటునకు పోయి గంగాస్నాన మాచరించి కాళీమాయి దర్శనము చేసిరి. అక్కడ నుండి గయ వెళ్లి పితరులకు పిండోదకములు వదలిరి. ప్రయాగలో త్రివేణీ సంగమమున గ్రుంకు లిడి, వాంఛావటమును దర్శించిరి.

తదుపరి కాశీ పుణ్యక్షేత్రము చేరిరి. గంగానదిలో సుస్నాతులై విశ్వేశ్వ రాన్నపూర్ణల దర్శనము చేసికొని, గొప్ప అభిషేకములు చేయించి, మనసార రుద్రపాదములు శిరసావహించి ప్రసాదములు స్వీకరించిరి. కాశీ నగరమున

వారము దినములుండి—ఒకనాఁడు మణికర్ణికా తీర్థమున స్నాన మాడుట, ఒకనాఁడు దశాశ్వమేధ హారిశ్చంద్రాది. వివిధ ఘట్టముల దర్శించుట, ఒకనాఁడు కాలభైరవుని దర్శ నము, మఱొక నాఁడు డుంఠి విఘ్నేశ్వర సందర్శనము— ఈ విధముగ అచ్చటి తీర్థము లన్నియు సేవించి, అచ్చట గల అసంఖ్యాము లగు శివ లింగములకుఁ బ్రణమిల్లిరి.

ప్రతి స్థలముయొక్క పూర్వ వృత్తాంతమును సత్య నారాయణ దీక్షితుల కెఱిఁగించుట; ఎక్కడ ఎవ్వ డెవ్వ డెంతెంత వెచ్చింపవలెనో తెలియఁ జెప్పుట, ఆ ప్రకారము. ఆతఁ డాచరించుట—అట్లు జరుగుచు వచ్చినది.

ఒకనాఁటి సాయంకాలమున భోజనముల వేళకు. సత్రము చేరుకొనిరి, భోజనము లయినవి. ఇఁక పరుండమని. ఎల్లరును ప్రక్కలు సరదుకొనుచుండఁగా సత్యనారాయణ. పెద్ద రాగాలతో తన బట్టలు వెతకుకొనసాగెను: "ఎవరో యెత్తుకపోయిరి బాబోయి నా సంచి! ఒకటి కాదు రెండు కాదు, ఇరువది మూఁడు రూపాయ లోయి నాయనా! అయిదురూపాయల నోట్లు నాలుఁగు—సరిక్రొత్తవి రెండు రూపాయలు—రూపాయ చిల్లరనోయి పరమేశ్వరా! ఎవ రికి పుట్టినదోయి ఈ దుర్బుద్ధి దేవుఁడా! నా గతి ఏమి. చెప్పినావు విశ్వనాథా!" అనుచు ఇంటి మీఁది పెంకు లెగిరి. పోవునటులు బొబ్బలు పెట్టెను.

# ఆత్మజ్యోతి

౯

"దార ధన పుత్ర వాంఛల బారిఁ గూరి
తెలివి యుండుటచేఁ బశువులను మించి
విశ్వ సోదర భావంబు విస్మరించి
తల్లడిల్లుచు నుంటి మో తమ్ములార!"



జిజ్ఞాస: దీక్షితులు పండుకొనినాఁడు కాని నిద్దుర పట్టదు. ఆశా పిశాచ మావేశించినది.

'తన మిత్రుని దగ్గఱ అసలు సొమ్మే లేనిది దొంగిలింపఁబడుట ఎట్లు? ఎచ్చటను ఒక్కదమ్మిడియైన ఖర్చు పెట్టనే లేదు; ఒక్క రూపాయ మాత్రమే కద బదులు తీసికొనినాఁడు!" అని విచారింపఁ దొడఁగెను.

"ఛీ! ఛీ! వానిని గుఱించి నే నెందుల కిట్లు తల పోయ వలయు? పాప కార్యము! ఇఁక ఈ గొడవ తలపెట్ట కూడదు" అని తన్నుఁ దా మందలించుకొనెను.

కాని ఉత్తర క్షణముననే తన నిశ్చితము నుల్లంఘించి పూర్వ విషయము జ్ఞప్తికిఁ దెచ్చుకొని ఇట్లనుకొనెను:

"ఛీ! వట్టి పిసినారి! పైసకును ప్రాణమునకును లంకె! మెతుకు పోయిన బ్రతుకు పోవు ననుకొను పరమ లుబ్ధుఁడు! ఎట్టి అసంభావ్య ప్రసంగము! సంచి ఎవరో ఎత్తుకొని పోయిరఁట! చిన్న కుఱ్ఱవాఁడు కాఁబోలు! అతని యొద్ద సొమ్మే లేనిది పోవుట యెట్లు తటస్థించును! లేదు లేదు, నా కన్నులలో కారము కొట్టుటకు పన్నిన పన్నుగడ! బూటకపు నాటకము! వేఱేమియు కాదు."

అటు పిమ్మట దీక్షితులు అయోధ్య వెళ్లి అచ్చటి శ్రీ రామాలయము లన్నియు నొక్కటియు విడువక దర్శించి సరయూ నదిలో గ్రుంకు లిడెను. తరువాత బృందావనము ద్వారక హరిద్వారము బ్రహ్మకపాలము మొదలగు మహా క్షేత్రములు సందర్శించెను.

అటనుండి పూరీక్షేత్ర సందర్శ నోత్సుకుఁడై తిరుగు ముఖము పట్టెను. మార్గమున భువనేశ్వరము సేవించి అచ్చటి శిల్ప కళా చాతుర్యమునకు అబ్బురపడెను.

అనంతరము పూరీనగరము ప్రవేశించెను. కొంత దవ్వు నుండియే అతనిని పండాల గుమస్తాలు పెద్ద దండువలె ముట్టడించిరి. మా పండా దగ్గఱకు రమ్మనిన మా పండా దగ్గ ఱకు రమ్మని వారు దీక్షితుని బేజారుపరుపసాగిరి. ఈ అల జడి దుస్సహముగ నుండెను. ఇతర క్షేత్రములందు పండాల

నతఁ డెఱిఁగి యుండెను కాని ఇచ్చటి వీరు, వారి నందఱిని మించి చీకాకు పరుప సాగిరి.

ఎట్టకేలకు దీక్షితుని గ్రామము ఎలమంచిలి యని వినఁగానే అం దొకఁడు చిఠాల తెచ్చి, ఎలమంచిలివారి పండా మా పండాయే కావున మీరు మా దగ్గఱకే రావలె నని లాగెను. దీక్షితులు మౌనముగ వాని ననుసరించెను. తక్కిన వా రంతలో వదలిపోయిరి.

దీక్షితులు పూరీలో ఇంద్రద్యుమ్న సరస్సు, సేతు కుండము, స్వర్గద్వార మహోదధి మొదలగు పంచతీర్థము లందును సుస్నాతుఁడై మహా దేవాలయమున శ్రీ జగన్నాథ స్వామిని సందర్శింప నేగెను. దేవాలయ ప్రాంగణములో గంట స్తంభమునకు ప్రదక్షిణము చేసి మొదట పతితపావన మూర్తికి మ్రొక్కి ఇరువది రెండు పావంచాలును మ్రొక్కు లతో నెక్కిపోయెను. లోన మహాదేవాలయము చుట్టును గల ముక్త మండపము, విమలాదేవి మందిరము, మహా లక్ష్మి మందిరము మొదలయిన అసంఖ్యాకములగు మంది రాదులు దర్శించి పిమ్మట స్వామి మందిరము ప్రవేశించెను. గరుడ స్తంభముకడ దీపములు వెలిఁగించెను. అటనుండి శ్రీ జగన్నాథస్వామి బలభద్రస్వామి, సుభద్రా దేవి—ఈ దివ్య విగ్రహములు కనులారఁ జూచి చేతులు జోడించి మ్రొక్కి లిడెను.

# ఆత్మజ్యోతి

౧౦

"కనుఁగొన్న యట్లుగాఁ గలలఁ గాంచితిని,
గద్గద స్వరముతోఁ గలవరించితిని,
మెఱసిన చో టెల్ల మెలపుతో వెదకి
దొరకిన మణి యెల్ల దొలిచి చూచితిని,
ఇన్నింటఁ గనరాని యీ రత్నమూర్తి
కన్నీటిలోన నే గానవచ్చుటకుఁ
దాత్పర్య మే మని తలపోయుచుండ
నా ప్రేమరత్నమా ! నవ్వుచున్నావె ?"



ఆత్మజ్యోతి: ఆ త్రిమూర్తుల దర్శించి దీక్షితులు ధన్యాత్ముఁ డైనాఁడు. అతని శరీరమున పులకాంకురము లుదయించినవి. మందిరములో జన సమూహమునకు మితి లేకుండెను. వందలు వేలును స్వామి దర్శనమునకు త్రొక్కుడు పడుచుండిరి. పరవశులై కొందఱు గొంతుక లెత్తి కీర్తనములఁ బాడుచుండిరి. "జే! జగన్నాధస్వామికీ జే! బలభద్రస్వామికి జే!! సుభద్రా

మాయీకీ జే!!!" అను ధ్వనులు మందిర మంతటను ప్రతిధ్వనించుచుండెను. ప్రతివారును వైకుంఠమున శ్రీమన్నారాయణుని సన్నిధినే ఉన్నట్లు భావించుచుండిరి.

దీక్షితులు, తనకు ముందున నున్న ప్రేక్షకుల బుఱ్ఱలు ఎగా దిగా పరికించుచుండ, స్వామి సమీపమున గర్భగుడిలో అందఱకంటెను ముందుగా—సరిగా సుదర్శనము వలెనే—ఊదా చొక్కా వేసికొని, దీపకాంతికి మెఱయుచున్న బట్టతల ముసలియతఁడు హఠాత్తుగ దృష్టికి గోచరించెను. అతనిని చూచి దీక్షితులు :

"ఏ మిది? సుదర్శనమువలె నున్నా డతఁడు!—సుదర్శనమా? అఁయి యుండఁడు. నా కంటె ముందు వచ్చుట కవకాశ మేదీ? దారి పొడుగునను యాత్రికులను జాగ్రత్తతో చూచుకొనుచునే వచ్చితినే! అతఁడు నా దృష్టినుండి తప్పిపోవుటకు వీలు లేదే!" అని సంశయాకుల చిత్తుఁ డయ్యెను.

దీక్షితు లిట్లనుకొనుచుండ ఆ నూతన పురుషుఁడు స్వామివారికి సాష్టాంగ దండ ప్రణామము లాచరించి ముఖ మిటు త్రిప్పినాఁడు; కేవలము సుదర్శనమే! ఉంగరములు తిరిగిన ఆ నల్లని గడ్డము, కనుబొమలు, కనులు, ముక్కు, మొగము, చిన్ని బొజ్జ—ఇఁక నిది యది ఏమి? తప్పక అతఁడు సుదర్శనమే, ఎంతమాత్రము సందేహము లేదు!

మిత్రరత్నమును కనుఁగొనినప్పటి దీక్షితుని ఆహ్లాద మింతింత కాదు. తన కంటె ముందెట్లు రాఁగలైనా యని విస్మితుఁ డయ్యెను.

మరల తప్పిపోవు నేమో యని దీక్షితులు నిలుచుండి సుదర్శనము వైపే కనుపెట్టి చూచుచుండెను. కాని అంత లోనె మఱి కొందఱు మార్వాడీ యాత్రికులు పెద్దగుంపుగా మందిరములో ప్రవేశించిరి. అంతతో ముందువారు వెనుక కును, వెనుకవారు ముందునకును త్రోపులాడ సాగిరి. ఆలయ రక్షకభటులు అరటి నారలతో కట్టిన బెత్తములు జళిపించు చుండిరి కాని త్రోపులాట ఆగుట లేదు.

ఈ తోరత్రొక్కుళ్లలో దీక్షితు లొక మూలకు త్రోసి వేయఁ బడెను. సంచి ఏమైపోవునో యను భీతి మరల కలిగినది. ఒక చేతితో సంచి గట్టిగా పట్టుకొని రెండవ చేత గుంపును నెట్టుకొని ఎటులో బయటఁ బడి నాఁడు. ఈవలకు వచ్చి సుదర్శనము కొఱకు ఇటునటు చూచి నాఁడు, కానరాలేదు. మండపములు, వాహన స్థలములు, పూలతోటఁలు, అన్నియు తెగ వెదకినాఁడు; కాని కనుఁ గొన లేకపోయెను. ఆ యూర సత్రములోని ప్రతి బసలోను మఠములలోను దర్యాప్తు చేసినాఁడు, ఎవ్వరును తెలియ దనిరి. శరీరములో శక్తి యుండినదాఁక కాళ్లు రోళ్లగు నటులు తిరిగి భగ్నమనోరథుఁడై బసకు మరలెను.

ఇంతవఱకును మన సత్యనారాయణ దీక్షితుని వెంబడించి వచ్చుచునే యుండెను, కాని ఈ సాయంకాలము మామూలు ప్రకారము అతఁడు బసకు రాలేదు. దీక్షితుల యొద్ద కొంత సొమ్ము కూడ తీసికొని అతనిని బుట్టలో పెట్టి మటుమాయ మయినాఁడు. 'గాలికి పోయిన పేలపిండి భగవ దర్పిత' మన్నట్లు, సొమ్మునుగుఱించి దీక్షితులు చింత వదలుకొనినాఁడు. ఇపుడు దీక్షితులు ఒంటరిగనే ఉండవలసి వచ్చినది.

మఱునాఁడును దీక్షితులు పూరీ యందే ఉండి మన సార స్వామి దర్శనము చేసికొని పోవ వలెనని నిశ్చయించుకొనెను. ఇంచుమించుగ ఆలయపు సింహ ద్వారమున కెదురుగనే 'పంచాయతి కుతా' యందు అతఁడు బసచేసి యుండెను. మఱుసటి దినమున "చందన తలాఉ" నం దాతఁడు స్నాన మాచరించి స్వామి ప్రసాదమును భుజించెను. స్వామి ప్రసాదాన్నమునకు అచ్చట అంటు, ముట్టులు లేకుండుట కతఁడు మది మెచ్చెను. దేశ మంతటను ఇటులే యుండిన, ఇన్ని కుల విభేదము లుండకుండును కదా యని లోలోన తలపోసెను.

నాఁటి సాయంకాలము ఆరతి దర్శన సమయమున కతఁడు మరల మహాదేవాలయమునకు భక్తి హృదయముతో

విచ్చేసెను. చని, స్వామివంక అట్టె చూచుసరికి మరల సుదర్శనము ప్రత్యక్షము!—ఆ దీపికల వెలుఁగున మెఱయు చున్న బట్టతలతో స్వామి ప్రక్కనే భుజములు చాఁచి, తానే అర్చకుఁడా యని తోఁచునట్లు భక్తితో పూజ సల్పు చుండెను.

'ఓహో! ఈతూరి ఇతనిని వడలఁ గూడదు' అని నిశ్చయించుకొని దీక్షితులు దారి చేసికొని ముందునకు వెళ్లెను. వెళ్ళునప్పటికి సుదర్శన మగపడలేదు. మరల దీక్షి తులు నిరాశుఁడై బసకు మరలెను.

ఎట్టులయిన సుదర్శనమును కలసికొనవలెనను గట్టి పట్టుదలతో దీక్షితులు మూఁడవ దినమున కూడ ఆ యూర నే నిలిచిపోయి వెతకవలసిన చోటు లెల్ల వెదకినాఁడు. ఇంకను భ్రాంతి తీఱక ఆలయములో మఱొక్క పరి చూచి పోవుదమని ఆ సాయంకాలముకూడ వెళ్లినాఁడు. ఆనం దము? ఆశ్చర్యము!!—అదిగో, తిరుగ శ్రీ స్వామివారి ప్రక్కనే యున్నాఁడు సుదర్శనము! ఒహో! భుజములు పూర్ణముగఁ జాఁచి ఊర్ధ్వముఖముతో నిశ్చలభక్తి పూరి తుఁడై సమాధిలో నున్నాఁడు; ఏమి ఆ మిసమిసలు గ్రక్కు దివ్య తేజము! ఆహా! చిదానందరస మొల్కు చిఱు నవ్వు పెదవులపై పల్లవించు చున్నదే! ఆ బట్టతల మున్నెన్నఁ

ఢును లేని కాంతితో ప్రకాశించుచున్న దే!—సుదర్శనమా! ఎంత ధన్యుఁడవు!

"ఇప్పట్టున ఇతనిని పట్టి తీఱవలెను ; దీని కిది కాదు ఉపాయము. ఆలయ ద్వారము నొద్దనే కాచుకొని యుండె దను. అటు లయినచో అతఁడు నన్ను తప్పించుకొన వీలు లేదు" అని కృతనిశ్చయుఁడై దీక్షితులు ద్వారము నొద్ద కాచి యుండెను. అర్ధ రాత్రి దాఁటినది, ఒక్క పిట్టయు లేకుండ వెడలిపోయిరి. అర్చకులు కూడ తలుపులు వేసి కొను వేళ యైనది. ఎంత కనుపెట్టుకొని యుండినను సుదర్శ నము మాత్రము రాడాయెను. మఱి కొంతసేపు వెతకి విసిగి, దీక్షితులు బసకు పోయెను.

ఇఁకను ఆశ పెట్టుకొని యుండుట నిష్ప్రయోజనమని నిశ్చయించుకొనినాఁడు. ఇల్లు విడిచి చిరకాలమైనది. చేతిలో సొమ్ము కూడ కొంచెముగ నున్నది. అందుచే దీక్షితులు యాత్ర ముగించుకొని ఇంటివైపు ముఖము పెట్టినాఁడు. వీ లయినపు డెల్ల బండి మీఁదను, బండి దొరకనప్పుడు పాద చారిగను ప్రయాణించుచుండెను.

# ఆత్మజ్యోతి

## ౧౧

"కనియో కానకో పెడదారిఁ జనినవారు
చచ్చునప్పుడో కష్టంబు వచ్చునపుడో
స్వాంత మందైన నొకపు డీశ్వరునిఁ గూర్చి
యొక్కపరి మొఱ్ఱ యిడకుండ నుండలేరు."



పూర్వస్మృతి: దీక్షితులు మరల మొట్టమొదట బయలుదేఱిన బాట పట్టెను. ఇంటికి దాపు అయిన కొలఁదిని మనస్సు సంసార విషయములపైకి పరువిడఁ జొచ్చినది :

"జీవిత మంతయు ధారవోసినను ఒక్క యిల్లు కట్టుట బ్రహ్మాండము; పడగొట్టుటకో? చిటికవేపు పట్టదు! నేను లేకుండ కుఱ్ఱనాగమ్మ వ్యవహారములు సవ్యముగ నెఱవేర్చునా? అచట వర్షము లెట్లున్నవో! గడ్డి ఎంతో ప్రియముగ నున్నది, పశువు లెట్లు కాలము గడపినవో! ఇంతకును ముఖ్యమైనది—నేఁ జెప్పిన చొప్పున మావాఁడు పాక కట్టించెనో లేదో!"—అని ఇట్లు పరిపరి విధముల పర్యాలోచింపఁ దొడఁగెను.

వచ్చి వచ్చి మునుపు సుదర్శనము విడిపోయిన ప్రదేశము సమీపించెను. ఇపు డిచ్చటి ప్రజను ఆనవాలు పట్టలేము. క్రిందటిసారి చూచినపుడు పస్తులతో పడియుండిన ఆ జనులు ఇపుడు ధనధాన్యాది వైభవములతో తులతూఁగుచుండిరి. పంటలు పుష్కలముగ పండినందున వారు కఱవు దినముల నాఁటి కష్టములను మఱచి సుఖజీవులై యుండిరి.

కొంతసేపటికి దీక్షితులు సరిగా, సుదర్శనము మంచి తీర్థము కొఱకు వెళ్లిన ఊరు చేరుకొనెను. ఆ గ్రామమునఁబడి పోవుచుండఁగా ఒక గుడిసెలోనుండి తెల్ల కబ్బా ధరించిన బాలిక యొకతె వచ్చి "తాతా! తాతా! మా యింటికి రావా?" అనుచు ఆదరముతో పిలిచెను.

అతఁడు తప్పించుకొని పోవుద మనుకొనినాఁడు కాని, బాలిక నవ్వుచు అతని చొక్కా పట్టుకొని పాకవైపు లాగఁబోయెను.

"ఇదేమి కర్మమే పిల్లా! బ్రాహ్మణుని ముట్టుకొనెదవేల, పిచ్చి యెత్తలేదు కద! ఎవరిని చూచి ఎవ రనుకొను చున్నావో!" అని దీక్షితులు మందలించెను.

ఆ సమీపముననే చంటిబిడ్డ నెత్తుకొనిన ఇల్లాలు గుమ్మము దగ్గఱకు వచ్చి "దయచేయుఁడు దయచేయుఁడు మహాత్మా! కులముచే ఆచార హీనులము కాని కృతఘ్నులము మాత్రము కానేరము" అని యనఁగా—

ఎందులకో అని యతఁడు వెళ్లెను.

ఆమె:—బాబూ! దండము, ఈ పూఁట తమ రిక్కడ మాతో పాటు ఇంత కడుపు చలువ చేసికొని విశ్ర మింపుఁడు.

ఇట్లు సవినయముగ అర్థించి, చావడిలో చాఁపపైని దీక్షితులను కూర్చుండఁ బెట్టగా, పాదప్రక్షాళనముకై పిల్ల నీళ్లు తెచ్చి ఇచ్చెను.

దీక్షితులు:—అమ్మా! ఇదంతయు నేమో నాకు గ్రాహ్యము కాకున్నది. బొట్టు లేదని చెప్పి నన్నెవనిగ తలఁచితిరో! బ్రాహ్మణుఁడ నమ్మా, తల్లీ! నా దారిని నన్ను పోనిండు.

ఆమె:—ఓహో! బ్రాహ్మణోత్తములా! అయిన నేమి? మీ ఆచారముల కెట్టి భంగమును కలుగదు బాబు గారూ! ఈ యూరి కరణముగారు బ్రాహ్మణులు, స్వయం పాకము తెచ్చి యిచ్చెదను. అచ్చటనే తమరు నిష్ఠతో కర్మాదికములు జరుపుకొన వచ్చును. మేమును బ్రాహ్మణుల ఇండ్లలో మసలెడువారమే నండి. 'అభ్యాగత స్వయం విష్ణుః' అనునట్లు మంచి వసంత ఋతువులో దయచేసినారు. ఈ యేఁడు మాతోఁట చక్కఁగ ఫలించినది లెండి, తమ ఆశీర్వాచనము వలన. ఇన్ని మామిడిపండ్లు మీ కుక్షిలోఁ

బడినచో మేము ధన్యుల మగుదుము. లెండు బాబూ! ప్రొద్దు పోవుచున్నది.

"మన సుదర్శనము మంచితీర్థము కోసము వచ్చినది ఈ యింటికే అని జ్ఞాపకము, అతనిని గుఱించి అడిగి చూచెదను, అన్నియు బయల్పడును" అని దీక్షితులు తనలో తా ననుకొని, ఆమెతో ఇటు లనెను :

అమ్మా! చూడుము. పెట్టుపోఁతలతో పని యేమి? అన్న రసముకంటె ఆదర రసము ఎక్కువ కద! నూటికి కోటికి అట నట నీ బోఁటి సచ్చారిత్ర లుండుట వలననే ఇంకను కొంతమంది కయినను నోటికి నీళ్లు దొరకుచున్నవి. తల్లీ! నా మాట విని భోజనమునకై నన్నిబ్బంది పెట్టకుము. రెండో మూఁడో పండ్లు తిని, నీ ధర్మమా యని ఇంత మజ్జిగ తేట దాహమున కిచ్చితివా పుచ్చుకొందును. తెల్లవారు జాము ననే లేచి, ఎండ పడకుండ చల్లటి ప్రొద్దున సాగిపోయెదను. ఎదుట అనవలసిన మాటకాదు కాని, లక్ష్మీకళ యున్నది నీకు. ఎంత ఇష్టము లేకున్నను అదేమో మీ మాటకు అడ్డు చెప్పలేక పోవుచున్నాను.

ఆమె:—"మీ ఇష్ట మెటులో అట్లే కానిండు. ఈ దీనురాలి మాట కొట్టి వేయకుండినందుకే పరమ సంతోషము.

బాబుగారూ! ఎండ యనక వాన యనక పాపము! ప్రజ—అవసరముల కొలఁది వేళగాని వేళ ప్రయాణము చేయుచుందురు. ఈ మాత్రపు టాదరమైన లేనిచో, ఇచ్చట మే ముండి యెందులకు ఊషర క్షేత్రముల వలె! గృహస్థాశ్రమ నియమములను ఉల్లంఘించుట కాదా! ఇంతకును మేము చేయఁగల మహోపకార మే మున్నది? గ్రామమునకు వచ్చి పోవు వా రెవరో కూడ తెలిసికొనకుండ మైమఅచి తెనుఁగు భూమికి మచ్చ తెచ్చిపెట్టమా? లేదు లేదు. మన దేశ మింకను ఆతిథ్య ధర్మమునకు గొడ్డువో లేదు!

స్వామీ! మా ముక్కు మొగ మెఱుఁగని అన్యుఁడొకఁడు వచ్చి—అబ్బ! తలఁపునకు వచ్చిన ఒడలు జల్లుమనుచున్నది—మాకు ప్రాణదానము చేసినాఁడు. 'దేవుఁడు లేఁడు దయ్యము లేదు' అని కన్ను మిన్నెఱుఁగక నాస్తికులమై చరించుచుంటిమి. "ఓహో! మనకు తగిన ప్రాయశ్చిత్తమైనది, చావు మూఁడినది" అనుకొను దుస్థితి కల్పించి పరమేశ్వరుఁడు మాకు బుద్ధి చెప్పినాఁడు.

నిరుడు ఈ రోజులలో తిండి లేక పస్తులతో రోగములతో అల్లలాడుచు మరణోన్ముఖులమై యుంటిమి. దైవము మమ్ము చూచి కరుణతో మీవంటి వానినే, ఒక ముసలాయనను మా కడకు పంపినాఁడు. అతఁడొకనాటిఁ మట్టమధ్యాహ్నమున మంచినీళ్లకై వచ్చెను. మా స్థితి

చూచినంతనే గుండె నీరయి మాతో నుండిపోయినాఁడు. ఆఁడుతోడు కంటె ఎక్కువగ పథ్యపానము లమర్చి పెట్టినాఁడు.

చల్లని వేళ జ్ఞప్తికి వచ్చినది—ఆ డాక్టా సీతమ్మ గారు—మా బోఁటి దీనుల చూచియేఁ కాఁబోలు అన్న ప్రదానమునకు కంకణము కట్టుకొని శాశ్వత యశోధనము గడించుకొనినది!

పిమ్మట ఎన్నో విధముల సాయము చేసి, భూమి తనఖా విడిపించి, బండి యెద్లు కొనిపెట్టి—ఇది యది అన నేల?—అతఁడు చేయని ఉపకారమే లేదు..."

అనుచు ఇంకను చెప్పుచుండఁగా ముసలిది అడ్డువచ్చి ఇట్లు ప్రస్తావింపఁ దొడఁగెను:

"నాయనా! అతఁడు మానవుఁడో దేవదూతయో ఈ క్షణమువఱకును తెలిసికొన లేకున్నాము. అతనికి మాపైఁ గలిగిన ప్రేమ—అబ్బా! చెప్పుటకు మాటలు చాలవు. ఎంత కరుణాళుఁడు! ఎట్టి నవనీత హృదయము! కడకు తా నెవరో కూడ చెప్పకుండ అదృశ్యుఁ డైనాఁడు.

శాస్త్రులుగారూ! ఇప్పుడు జరిగి నట్లున్నదండి అదంత యును. అదిగో, ఆ మంచముమీఁదనే తల వ్రాల్చుకొని

చావ సిద్ధముగ నుంటిని. ఆ సమయాన వచ్చినాఁడు ఆ బట్ట తల పొట్టి తాత. నిరాడంబరుఁడు సుఁడీ! పాపము! గ్రు క్కెఁడు మంచి నీళ్లిమ్మనినాఁడు, అంతకంటె మ తేమియు కోర లేదు. నాయనా! పాపిష్ఠురాలను. "ఇతని కిక్కడ ఏమి పని చెపుమా" అను దుష్ట తలంపు కల్గినది నాకు. మముఁ జూచినంతనే ఆత్మారామునకు అర్ఘ్య మిచ్చు చున్నాఁడా! అనునట్లు అతఁడు బాష్పములు విడిచినాఁడు. విడిచి చిటికర మైన జాగు సేయక బుజమునుండి సంచి తీసి తెఱచినాఁడు."

బాలిక:—కాదే అమ్మమ్మా! రాఁగానే దుస్తు లూడఁదీసి నడవలో క్రిందఁ బడవైచి, పిమ్మట సంచి విప్పినాఁడు.

ఇవ్విధమున అవ్వయు మనుమరాలును—సుదర్శన మొనర్చిన కృత్యములు, అతఁ డాడిన మాటలు జ్ఞాపకము తెచ్చుకొని, వేడుకగా వాదులాడఁ జొచ్చిరి. అతఁ డెట కూర్చుండెనో, ఎట పండుకొనెనో ఆ యున్న నాలుగు రోజు లును ఏమేమి చేసెనో, వీనుల విందుగా ఏమేమి చెప్పెనో - ఒక్క విషయమయిన విడువక అత్యంతానందముతో నతని గుణ గణముల వినుతించుచుండిరి.

దీపాల వేళకు యజమానుఁడు బండి తోలుకొని పొలము నుండి వచ్చెను. వచ్చి—అతఁడు కూడ సుదర్శనమును పలువిధముల నిటులు ప్రస్తుతించెను :

"ఆ బాబే సమయమునకు రాకుండినచో మా పాతకములు మమ్ము కొట్టి ఎల్లరమును సర్వసేనామూర్ఛగా యమపురికి అరిగి యుండవలసినదే. మా పాలిటి నారాయణుఁడు—చిట్టి బొజ్జ గల ఆ పొట్టితాత—ఆ చిఱునవ్వుల చిదానందమూర్తి—మాకు ఆయువు పోసి పునర్జన్మము ప్రసాదించినాఁడు. గాఢాంధకారమును విరియఁగొట్టు దివ్య తేజోమూర్తి యైనాఁడు. ఆ మహానుభావుఁడే భగవత్తత్త్వము క్రియారూపమున విశదీకరించినాఁడు. ప్రత్యక్ష సాధనములచే మాకు జీవిత రహస్య మువదేశించినాఁడు. 'ప్రేమ' యను దివ్యౌషధముచే పశుప్రాయులుగ నున్న మమ్ము మానవులుగ మార్చినాఁడు. ఇంత చేసి ఆ పావన పురుషుఁడు చెప్పకయే వెడలిపోయెను. చెప్పు టెందులకు? లేశమయిన ప్రతిఫలాపేక్ష యున్నఁ గద! వచ్చిన కార్యము నెఱవేఱిన పిమ్మట అట్టి దేవదూతలు క్షణమైన వ్యర్థముగ నిలువరు! ఆ పొట్టితాత మా చెంత నుండక పోయిన పోనీ! ఆ ఆనందమూర్తి పేరు మాకు తెలియ నీయకున్న పోనీ! ఆ ప్రేమ స్వరూపుని 'ఆత్మజ్యోతి' మట్టుకు మా మానస ముకురములలో ప్రతిబింబించి చిరస్థాయిగ వెలుఁగుచున్నయది.

[చేతులు జోడించి]—పరమేశ్వరుఁడా సుగుణ ఖనిని సదా కృపఁజూచుఁగాక!''

పిమ్మట దీక్షితులు పాలు పండ్లు స్వీకరించి, రాత్రి పూఁట తాత అమర్చిన పీఁచుపఱుపుపై పండుకొనెను. ఇంటిలో ఎల్లరును నిద్రించిరి.

దీక్షితులు పండుకొనినను నిదుర పట్టక సుదర్శనమును గుఱించియే తదేక దృష్టితో ఆలోచించుచుండెను. యాత్రలో తనకు మూఁడు పర్యాయములు సుదర్శనము కనఁబడుట కన్నులకు కట్టి నట్లుండెను.

''ఓహో! ఇదియా దీని రహస్యము! ఈ విధమున నా, సుదర్శనము నాకంటె ముందుగ దేవళములోనికి వెళ్లి స్వామి సాన్నిధ్య మహాలాభమును పొందగలిగెను! యాత్రలకై నేను పడిన వ్యయప్రయాసములకు దేవుఁడు మెచ్చినాఁడో లేదో కాని, సుదర్శనుని సేవ మాత్రము స్వీకరించె ననుట నిశ్చయము.

''కలుపు తీయక సస్యము వృద్ధిఁ బొందునే! చిత్తశుద్ధి లేక నే నెన్ని యాత్రలుచేసి ఏమిఫలము! సుదర్శనము పరిశుద్ధ మనస్కుఁడు, కావుననే పరమేశ్వరుఁ డతని ఆత్మ తన నిలయముగఁ జేసికొనినాఁడు. నా బోఁటి అజ్ఞానినటె

సుదర్శనము దేవుని వెదకఁ బోలేదు. అతడు పరిశుభ్రము చేసి యుంచిన పవిత్ర హృదయ గేహమును వెదకికొనుచు వచ్చి ఆ దేవుఁడే ప్రవేశించినాఁడు. నా వెఱ్ఱి కాని—వెదకికొనుటేమి ప్రవేశించుటేమి? సుదర్శనమే దేవుఁడు, దేవుఁడే సుదర్శనము!

"'ప్రేమ' సూత్రము ధరించిన ఆత్మజ్యోతి! అఖండ జ్యోతి!"—

ఇట్లనుకొనుచు జలజల బాష్పకణములు రాల్చెను.

మఱునాఁడుదయముననే దీక్షితులు ఇంటివారి సెలవు గైకొని పయనమై పోయినాఁడు.



# ఆత్మజ్యోతి

౧౨

"కఠిన పశ్చాత్పరీతాప కలన, గాని
కలుష హృదయాంతరంబు నిర్మలము గాదు."



తరణోపాయము: దీక్షితులు యాత్రలు సేవించుకొని స్వగ్రామమునకు మరలునప్పటికి సుమారు వత్సర మయినది.

ఒకనాఁటి సాయంకాలమున ఇలు సేరినాఁడు. చేరునప్పటికి కొడుకు ఇంట లేఁడు. తప్పత్రాగి తూలుచు, నోటి దుర్గంధముతో కొంతసేపటికి 'పానశాల' నుండి వచ్చి తండ్రికి ముఖముఁ జూపెను. ప్రశ్నల వెంబడి ప్రశ్నలు వేయుచు దీక్షితులు సంగతు లెల్ల గ్రహించెను. తండ్రి లేకుండ చూచి దీక్షితుని సుపుత్రుఁడు ఇంటి పను లెల్ల ఎగవేసి కుండలో గుఱ్ఱాలు తోలుచుండెను. ఇంటి వ్యవహారము లన్నియు అద్దు పద్దు లేకుండ ఆరుమూఁడులు చేసి చిక్కులు పఱిచెను. దుస్సాంగత్యముచేఁ జేత నున్న ధనమంతయు విచ్చలవిడిగ వెచ్చించెను. వెచ్చించుటయె గాక

పుట్టునంత మట్టునకు ప్రోనోట్లపై అప్పులు చేసి యథేష్టముగాఁ దిరుగుచుఁ ద్రాగుచు నుండెను.

ఇదంతయుఁ జూచి పట్టలేక దీక్షితులు, కుమారుని చీవాట్లు పెట్టఁగా అతఁ డహంకారముతో—"నిన్ను తీర్థయాత్రకు పొమ్మని ఎవ రేడ్చిరి? ఏ పాటి పుణ్యము మూటఁ గట్టి తెచ్చినావు? ఇంటి నంటిపట్టుకొని యుండి వ్యవహారము లన్నియు చక్కఁబెట్టుకొన లేకపోయితివా? సొమ్మంతయు మోసికొనిపోయి గంగార్పణము చేయనేల? సొమ్ముకోసము తంతి కూడ నిచ్చితివే దాఁచఁబెట్టినట్లు! ఇంకను డబ్బు లెక్క చెప్పవలె నేమి నీకు!" అనుచు వదరఁ జొచ్చెను.

ఈ యపూర్వ వచో ధోరణికి తండ్రి ఉగ్రుఁడై చేత నున్న చేవకఱ్ఱతో రెండు తగిలించెను.

కుఱ్ఱవాఁ డిప్పుడు పోకిరి జట్టులో ముఖ్యుఁడుగ నున్నందున తండ్రి నిసుమంతయు లక్ష్యపెట్టక మఱింత రెచ్చి—"రేపు సాయంత్రమునకు నీవు విష్ణుసాయుజ్యము చెందెదవు లే; లేకున్న నన్ని పేరు పెట్టి పిలువ వలదు; తండ్రి గిండ్రి తరువాతఁ జూచుకొందము" అని ఎదిరించి బెదరించెను. తెగించిన వారి నెవ రేమి చేయఁగలరు!

"ఓహో! ఊరకున్న వీని పని కుదుర" దని తలంచి దీక్షితులు మఱునటి యుదయముననే గ్రామాధికారులతో మాటాడ బయలు దేఱెను. సుదర్శనుని ఇల్లు ఆ దారిలోని సందులోనే యుండుటచే మిత్రుని చూచి మఱి పోవుదమని అటువైపు మరలినాఁడు.

సుదర్శనుని భార్య—సుందరి—బిడ్డను చంక నిడుకొని గుమ్మములో నిలువఁబడి యుండెను. ఈమె రూపముననే గాక గుణములందు సైతము సుందరియే. ఆ పతికిఁ దగిన సతి, వివేకవతి యైన వనితా తిలకము. దీక్షితుని కనుఁగొని పట్టరాని ఉత్సాహముతో :—

ఓహోహో! దీక్షితులు బాబుగారా! ఎప్పుడు వచ్చుట? ఎన్నినాళ్లకయినది తమ దర్శనము! యాత్రలు సేవించుకొని సురక్షితముగ వచ్చినారా? పుణ్యాత్ములు! విశేషము లేమండి?

దీక్షితులు :—అమ్మా! శ్రీపతి కటాక్షమున క్షేమముగ ఇలు సేరితి. విశేషముల కేమున్నవి! నీ భర్తగారు నన్ను మధ్య మార్గమున చెట్టెక్కించి నిచ్చెన తీసివైచినాఁడు. లేకున్నచో మఱికొన్ని ముఖ్యక్షేత్రములు కూడ సేవించియుందును. ఇంటికి తిరుగ వచ్చినాడఁట కాదా ఆయన!

ఆమె :—అవునండి బాబుగారూ! మా వారు తిరిగి వచ్చి చాల కాల మైనది. లెక్కకు ఏవో కొలఁది యాత్రలు సేవించుకొని వెంటనే మరలిరి. ఆయన తిరిగి వచ్చుటే మేము దైవానుగ్రహ సూచకముగ భావించితిమి. వారు ఇల్లు విడిచి చనిన రెండు మాసముల పక్షమును నిశ్చయముగ ఏమియు తోఁచెడిది కా దనిన నమ్మఁడు. స్వాతివానకు ముత్యపు చిప్పలు ఎదురు చూచునట్లు వారికోసము నిరీక్షించుచుండెడివారము. "నాయన లేక దీపము లేని కొంపవలె నున్నదే మన యిల్లు" అని చిన్నవాఁడు తఱచు అనుచుండెడివాఁడు. తలఁవని తలంపుగ తండ్రిదర్శన మయినప్పటి వాని అపార సంతోష మేమని చెప్పుదును! చంటి పిల్ల కూడ మొదలిడినదండి నన్ను తిట్టుటకు—"ఒ ం టి పు లి, రాకాసి వలె నాయనను పంపివేసి ఎట్లున్నావే అమ్మా!" అనుచు దెప్పుచుండెడిది. ఏమని మరదలించుటకును నాకు తోఁచెడిది కాదు. తండ్రి మీఁది ప్రేమచేతఁ గద వా, రట్లనుట! అందుచేత వారిని వారించుటకు నోరు రాలేదండి బాబుగారు!

దీక్షితులు :—సరే కాని మిత్రుఁడిపు డింటిలో నున్నాఁడా?

సుందరి :—ఉన్నారే! 'డెయిరీ ఫారము' లో, ఎవరి వెట్టి వారికి ఆనందము! ఎంతసేపును గోసేవయేకదు!

అదే వారికి గోవింద సేవ! చూడుఁడు, మొన్న ఈనిన కపిల గోవును చూచుకొనిన, మా వారికి భోజనమయిన నక్కఱ లేదు. దాని దూడ గంతులు వేయుట కనినప్పటి వారి ఉల్లాసము, బిడ్డఁడు తొడపైఁ గూర్చున్నప్పుడు కూడ ఉండదు. ఎంతో అభిమానమండి దీక్షితులుగారూ! దానిని లాలించుటలో మీ స్నేహితులకు ఏ చిన్నపిల్లలును అందరు! ఆవులకు చిట్టు తవుడు స్వయముగఁ బెట్టుదురు. రాత్రి మెలఁకువతో నాలుగు జాములును లేచి వానికి గడ్డి యున్నదో లేదో చూతురు. తప్పనిసరి యైనగాని పాలు పిదుకు పని పరులపైఁ బెట్టరు. ఈ ముదిమిలోఁ గూడ నెంత యోపికండి! వారి శ్రద్ధా భక్తులకు కర్షకులు కూడ ముక్కుపై వ్రేలిడుకొందురు. ఆయన వెంటనే ఇంటికి రాఁబట్టి, పను లెల్ల సొంతముగ చూచుకొనఁ బట్టి, గోవు లన్నియు చక్కఁగా నున్నవి. వారి చేతి చలువ యేమో కాని, ఆయన పోషణములో శల్యమాత్రములై యున్న పశువులు సయితము ఇట్టె తేరుకొనును.

పరమేశ్వరుఁడు మమ్ముల నొక కంటఁ జూచినాఁడు. నాలు గావులును ఒక్కసారి ఈనినవి. ఇంటిలో నందఱకును చేతుల నిండ పని కలిగి వ్యాపారము పుష్కలముగ నున్నది. ఇప్పటి కివ్విధమున సుఖముగ నున్నామండి బాబుగారూ! రండు, మిమ్ములఁ జూచుటకువ్విళ్లూరుచుందురు మీమిత్రులు.

అని చెప్పి దీక్షితులను 'ఘారము' లోనికి తీసికొని వెళ్లెను.

అచ్చట సుదర్శనము !—

దూడను గడ్డిపరకలతో తోమి దృష్టిదోషము తగులకుండ ఆ పరకలు దూడకు ముమ్మాఱు దిగఁదుడిచి అవలఁ బాఱవైచినాఁడు. అభిమానాస్పదమగు తన కపిల గోవును దువ్వ్వద మని మఱికొన్ని పరకలు చేతఁ బుచ్చు కొని దాని మెడ ఎత్తినాఁడు. ముచ్చట లూరు దాని ముఖ మును తదేక దీక్షతో చూచుచున్న సుదర్శనమును వీక్షించు సరికి నాఁడు జగన్నాథములో తాను కనుఁగొనిన సుదర్శ నుని దివ్య స్వరూపమే సరిగ ఇపుడు దీక్షితులకు గోచరిం చెను. ఆతని బట్టతల ఆదిత్య కిరణ ప్రభావముచే అప్పటి కంటెను ఇప్పుడు మఱింత వింతగ ప్రకాశించుచుండెను. దీక్షితు లట్టె నిలువఁబడిపోయి నివ్వెఱపాటుతో సుదర్శన మును అవలోకించుచుండెను.

సుందరి—[భర్త నుద్దేశించి]:—ఏమండోయి! మనకు అప్త్రులు గృహపావనము చేయ విచ్చేసినారు!

సుదర్శనము గిఱుక్కున తిరిగి చూచి చేతిలోని ఆ గడ్డి పరకలతోనే పరుగిడి వచ్చి దీక్షితుని కౌఁగిలించుకొని:-

ఆహాహా! ఎంత పుణ్యమోయి దీక్షితులూ! పరమేశ్వరుఁడు నీయందున్నాఁడోయి. "ఏమా! ఇతని జాడయే తెలియకున్నది" అని నిన్ను గురించి మేము ఎల్లరమును తలపోయని క్షణమే లేదు. ఎటులో ఈ నాఁటికి తిరుగ కంటఁబడినావు. పరమానందమైనది. నిశ్చయముగ నేఁడు పర్వదినము! యాత్రా విశేషము లేమో చెప్పు.

దీక్షితులు:—సుదర్శనమా! నా కాళ్లు మట్టునకు యాత్ర చేసికొని వచ్చినవోయి. కాశీగంగ, తోరములు, ప్రసాదములు, ఎన్నెన్నో నీకోసము తెచ్చియున్నాను. భోజనానంతరము మా ఇంటి కొకసారి రమ్ము, తీసికొందువు గాని, [ఆలోచనతో]—కాని యాత్రా ఫలము లేకపోయినదోయి. దేవుఁడు నా కష్ట మాలోచించినట్లు తలఁప జాలను...

సుదర్శనము;—అటు లనుకొనకుము దీక్షితులూ! భగవంతుఁడు కరుణాసాగరుఁడు!

దీక్షితులు:—[అట్టె ఊరకుండి దీనవదనముతో]—మిత్రరత్నమా! నా కాళ్లు మాత్రమే తీర్థములు సేవించినవి. కూడ వచ్చినది నా ఆత్మయో మఱొకరిదో, సంశయాస్పద విషయము......

సుదర్శనము:—దైవకార్యము! దైవకార్యము! అట్లు చింతింపఁ దగదు.

దీక్షితులు—[చెమ్మగిలిన కనులతో]—సుదర్శన మా! నీవు వెనుక నిలిచిపోయితివే మంచినీళ్ల కొఱకు! ఆ కుటీరములో నేను ఆఁగి.........

ఇఁక చెప్పలేక పోయినాఁడు. పొంగి పొరలుచున్న దుఃఖమును మనసులో ఇముడ్చుకొన లేకపోయినాఁడు. అశ్రుబిందువులు జలజల రాలజొచ్చినవి.

ఈ వాలక మంతయు చూచి 'ఇదేమిరా!' అని సుదర్శనము భీతి చెందినాఁడు. వెంటనే ఆ ప్రసంగము మానివేసి :

"దీక్షితులూ! రమ్ము, చావడిలో కూర్చుండి ఒకింత విశ్రాంతి గొనుము" అని తీసికొనివెళ్లి మిత్రుని సుఖాసీనుఁ గావించినాఁడు. "సీతారామం! రఘురామం!!" అనుచు ఒక్కపరి స్మరించుకొని నిర్మల మానసపూజ చేసికొనినాఁడు.

"ఇదిగో చూడు" అనుసరికి—లోపలినుండి సుం దరి ఒక వెండిపళ్లెముతో బంగెనపల్లి మామిడిపండ్ల ముక్కలును, ఆమె వెంట పిల్లవాఁడు రెండు చేతులలోను రెండు గిన్నెలతో ఱాయివంటి మీఁగడ పెరుఁగును, వాని వెనుక బాలిక కంచుచెంబులోను పంచపాత్రములోను పోసి చల్లని మంచితీర్థమును—తెచ్చి మేజాపైని పొందికతో నమర్చిరి.

మిత్రుని కుటుంబములోని ఆయన్యోన్య ప్రేమ, గౌరవ ప్రపత్తులు, వినయ విధేయతలు, చక్కని ఏర్పాటులు— చూచిచూచి తన దుస్థితి తలఁపునకు రాఁగా దీక్షితులు మఱింత విచారగ్రస్తుఁడై, తన కుమారుని ప్రవర్తనము మిత్రునితో వక్కాణించినాఁడు.

సుదర్శనము ఆ సంభాషణము మార్చి మిత్రుని ఊఱడించి ఎట్టకేలకు అతనిచేఁ దన ఆతిథ్యము స్వీకరింపఁ జేసెను. పిమ్మట కొంతసేపటికి ఉభయులును గృహ విషయకమైన సమాచారములు మనసు విడిచి ముచ్చటించుకొనిరి.

కడకు దీక్షితులు పెద్ద నిట్టూర్పు విడిచెను. ఆ కుటీర వాసులను గుఱించి గాని జగన్నాథములో ముహూర్తము సుదర్శనము సాక్షాత్కరించుటఁ గూర్చి కాని మఱి యెన్నఁడు ప్రస్తావింపలేదు.

'మానవ సేవయే మాధవ సేవ'—'గో సేవయే గోవింద సేవ'—అను సువర్ణ విలసితం బగు సుదర్శనము నుడులు దీక్షితుని మానస ఫలకమున చిరస్థాయిగ చిత్రిత మయినవి. ఇవే ఇంతకుమున్ను బాష్పధారలతో దీక్షితుని మనో మలినములు తుడిచివైచినవి. 'ప్రేమ'ను మించిన దివ్యగుణము మఱొండు లేదను రహస్యము నతఁడు గ్ర

షించినాఁడు. ఇదే దైవాజ్ఞ యని నమ్మినాఁడు. ఐహికైశ్వర్యాదులు కలలోని భోగములని గుర్తించినాఁడు. ఆ క్షణము నుండియు సత్కార్యాచరణమునకుఁ గడంగి పరోపకార పరతంత్రుఁడై ధన్య జీవనుఁడై తరించినాఁడు.

యాత్రలు ముగిసిన తరువాతి తన జీవిత మొక నవ్యలోకముగ భావించి, తఱచు ఇట్లను కొనుచుండెడి వాఁడు:

"తెలివిలో 'వాని' ఁ గానక తిరిగి తిరిగి
విశ్వ మంతయు వెదకుచు వెఱ్ఱి నైతి!"

శ్రీ

# ముద్దా విశ్వనాథము

[కవితా సమితి]

*



[వీరు—స్వార్థత్యాగులు దేశసేవాపరాయణులు నగు సోమప్పశాస్త్రిగారి పుత్రులు. తెనుగునాట పేరొందిన మహామహులు కీ. శే. కూచి నరసింహము పంతులుగారు వీరి మేనమామ. శ్రీ విశ్వనాథము గారు గ్రాంథిక వ్యావహారికములు రెండిటను దమ లేఖినిని నడుపఁగల సమర్థులు. వీరి వ్యాసములు పెక్కులు భారతి, గృహలక్ష్మి, ఆంధ్రభూమి మున్నగు పత్రికారాజముల నలంకరించినవి. 'వ్యాస కుటీరము' అను సారస్వత సంస్థను నెలకొల్పి వీరు వాఙ్మయసేవ గావించిరి. 1936, 1937 సంవత్సరములలో 'ఆంధ్రసేవ'యను కరపత్రమును వెలువరించి మాస పత్రికగ మార్చి కొంతకాలము ప్రకటించిరి. 1938 నుండి నాలు గేండ్ల వఱకు 'ప్రజామిత్ర' పత్రికకు సహాయ సంపాదకులుగ నుండిరి. ఆ కాలముననె 'వాణి' యను పక్షపత్రికకు సంపాదకులుగ నుండిరి. శ్రీ విశ్వనాథముగారి కృతులు: ఆత్మజ్యోతి, జన్మభూమి, ప్రేమాంజలి, సంధ్య: శుభోదయము, తూలిక, రామనామము, ఛాయ, మాయలోకము, మున్నగునవి. ఇవి గాక అముద్రిత గ్రంథములు పెక్కులు గలవు. ఈయన ఆంధ్రలోకమున కర్పించిన రచనలు బహుళ ప్రచారము నందియున్నవి.]

# :: :: జయా ప్రసూనములు :: ::

లోగడ మెలుపాక - వ్యాసకుటీరమునుండి వెలువడుచుండిన 'ఆంధ్రసేవా ప్రసూనము'లను చేర్చి ఇపుడీ 'జయా ప్రచురముల'ను క్రొంగ్రొత్త తీరులలో వెలయించుచున్నాము. సొంపులు గుల్కు అనేక ఆధునిక రచనలు 'జయానికేతనము'నుండి క్రమప్రచురణ నందబోవుచున్నవి. యథోచితమగు మా సేవను గుర్తించి ఆంధ్రమహాశయు లీ సంస్థకు పోషణప్రోత్సాహము లొసగినయెడల, అచిరకాలముననె దివ్యరత్నము లనంతములుగ తెలుగువారి కరకమలముల నలంకరించగలవని మనవి చేయుచున్నాము.

క్రౌన్ 1-8 సైజున సుమారు నూరు పుటలు గల 'జయా ప్రసూనముల'ను 8 పుస్తకములు గల సెట్టు ఒక టొకటి చొప్పున సమర్పింతుము. ఇవి మా అభిమాన పోషకవర్గములకు మాత్రమే లభ్యములు. పోషక మహాశయుల నామాక్షరములు మా ప్రసూనము లన్నిటను అలరించగలవు. ఎడనెడ 'నికేతనము'నుండి వెలువడు అనుబంధములు, ప్రత్యేక ప్రచురణలు మున్నగునవి ఉచితముగ నందజేయుచుందుము.

## పారితోషికములు (సెట్టు ఒకటింటికి)

| | | |
|---|---|---|
| ప్రతిష్ఠాపకులు | ... | ఒక గ్రంథమును ముద్రించి యనుగ్రహించువారు. |
| మహారాజ పోషకులు | ... ... | రు. 116 లు |
| రాజపోషకులు | ... ... | రు. 58 లు |
| పోషకులు | ... ... | రు. 25 లు |
| అభిమానులు | ... ... | రు. 10 లు |

జయానికేతనము: మదరాసు
శుభాను: ఉగాది 5-4-43

సంపాదకుడు:
ముద్దా విశ్వనాథము

## — జరతూ ప్రసూనములు : బుధజనాభిప్రాయములు —

“ఇవి యిట్టివని యొకరు వ్రాయుటయుఁ గొంతమంది యావ్రాతఁ జదివి యంతతోఁ దృప్తిపడి యూరకొంటయుఁ గాదు. ప్రతివారును జదివితీరవలెను. ఇట్టి కథలను జదువుటయే నిజమైన చదువు. పరమ ప్రశాంత భావముతో నీతినిఁ దలకెక్కించి బిడ్డలను సుఖనిద్రఁ బుచ్చఁ దల్లులు పాడు జోలపాటల వంటివే. చదివినఁగాని నిజము తెలియదు. కావున వ్రాసి పుస్తకములఁ దెప్పించుకొనుటయే కర్తవ్యము.”

—గృహలక్ష్మి.

*

“జాతీయతా వికాసమునకు ప్రబల హేతువులు, మహోన్నతాదర్శపూరితములు... సంఘాభ్యుదయమునకు ఇట్టి గ్రంథములే మూల సాధనములు.”

—ఆంధ్ర విద్యార్థి.

*

“అత్యుత్తమములైన విషయములగూర్చి చక్కని శైలిలో హృదయరంజకముగ వ్రాయబడియున్నవి.”

—సుబోధిని.

*

“School Libraries should acquire *such* books with a view to encouraging the reading habit among the young-pupils.”

—*The Hindu*.

## — జయా ప్రసూనములు : —

" మీ పుస్తకములు నాకు ఎంతయు సంతోషమును గూర్చుచు వచ్చినవి. నీతివిధ్వంసకములగు పనికిమాలిన పుస్తకములును పత్రికలును దేశములో వెల్లి విరియుచున్న యీ దినములలో ఎడారిలో పచ్చికపట్టుల వలె మీ సంఘమువారు ప్రచురించుచున్న గ్రంథములు ఆశోత్సాహముల గొల్పునవిగా నున్నవి. "

—శ్రీ పాలపర్తి నరసింహము,
('ధర్మసాధని' సంపాదకులు.)

*

" మహోన్నతాదర్శ భరితమగు నీ 'ప్రసూనమాలిక'ను ప్రకటించి తెలుగు వాఙ్మయమున కొక క్రొత్త తొడవును సమకూర్చిరని మా ఆశయము. విద్యాశాఖాధికారులును స్థానిక సంఘాధ్యక్షులును ఈ గ్రంథమాలికయొక్క ప్రాశస్త్యమును గుర్తించి పాఠశాలలందు పఠనీయ గ్రంథములుగ నిర్ణయించినచో తెలుగు బిడ్డల కనలేని సేవ జేసినవా రయ్యెదరు. "

—ప్రాథమిక పాఠశాల.

*

" I have gone through your books. I am at once struck with your motive, pure and simple underlying the selection and presentation of the stories. They are strikingly moral, effectively patriotic and keenly interesting. True teachers with a spark of patriotic morality in them cannot but give preference to your books "

—M. HANUMANTARAO, B.A., LT.,
*M. R. College, Vizianagram.*

# తూలిక

నైతిక జీవనచిత్రములు మనోహరముగ చిత్రించిన
కథాపుస్తకము. ఇందలి యమూల్య రత్నములు
ఒకదానిని మించినది మఱియొకటి.



*


కర్త :

ముద్దా విశ్వనాథము



*Approved for class use by the T. B. C.—Madras*
*(Vide Ft. S. G. G. dated* 14-5-46, *Pages* 6 *and* 20)

